సాధన గ్రంథ మండలి - 67.



# శివతాండవము

## (ఆర్ద్రోత్సవము)



గ్రంథపోషకులు:

శ్రీ బ్రహ్మాండం వేంకట లక్ష్మీనారాయణరావు

శ్రోత్రియందారు



ప్రకాశకులు:

సాధన గ్రంథ మండలి, తెనాలి.



వెల 1-0-0.

# శివతాండవము

మూలము :

శివపురాణము - సూతసంహిత

అనువాదము :

విద్వాన్ బులుసు సూర్యప్రకాశశాస్త్రి.

# విషయసూచిక



# శ్రీ శ్రీ కంచి కామకోటి పీఠాధిపతులు

(జగద్గురు శ్రీ శంకరాచార్యస్వామి మఠము, కాంచీపురము.)

తమ మఠనిర్వాహకులద్వారా పంపించిన

ఆశీర్వాచనము.

---

శ్రీ నారాయణరావు మహాశయులు,

గౌరీనిలయము : బాపట్ల.

నమస్కారములు

మీచే, 'శివతాండవ' మను గ్రంథము ఆంధ్రమున ప్రకటింపబడుచున్నదని, విని శ్రీచరణులు మిక్కిలిసంతసించిరి.

మీ శ్రేయస్సు కొఱకు శ్రీచరణులచే అనుగ్రహింపబడిన ప్రసాదము దీనితో పంపబడుచున్నది.

ఇట్లు

శ్రీచరణుల యాజ్ఞానుసారము నివేదించు

(Sd) శ్రీ మఠనిర్వాహకుడు

24-2-1958.



గ్రంధపోషకులు:

బ్రహ్మాండం వేంకట లక్ష్మీనారాయణరావు

శ్రోత్రియందారు.

శ్రీః

# సాక్షాత్కారము

తానుగ డాయ వచ్చి
        శుభదర్శన మిచ్చి కుమార! భీతిన్
మానుము మేలు బొందెదవు
        మత్పరిచర్యల సేయుమంచు నె
వ్వాని మహామయస్థితినిఁ
        బల్కి నిరామయుఁ జేసె మున్ను న
వ్వానిని శాపమంత్రి సుతుఁ
        బార్వతి నిత్యముఁ గాచుగావుతన్.

శ్రీ బాలాత్రిపురసుందర్యై నమః

# అంకితము

మాణిక్యవీణా ముపలాలయంతీం
మదాలసాం మంజులవాగ్విలాసాం,
మాహేంద్రనీలద్యుతి కోమలాంగీం
మాతంగకన్యాం మనసా స్మరామి.

శ్రీ శ్రీ శ్రీ బాలాత్రిపురసుందరీసమేత
శ్రీమదభినవ సోమేశ్వర స్వామివారికి
భక్తిపూర్వకముగ సమర్పితము

— బ్రహ్మాండం వేంకట లక్ష్మీనారాయణరావు.



శ్రీ శ్రీ శ్రీ బాలా త్రిపురసుందరీ సమేత

శ్రీమదభినవ సోమేశ్వరస్వామి

చతుర్భుజే చంద్రకళావతంసే
కుచోన్నతే కుంకుమరాగశోణే
పుండ్రేక్షు పాశాంకుశ పుష్పబాణ
హస్తే నమస్తే జగదేకమాత.

# ప్రస్తావన

మహాశయులారా!

బాపట్ల గ్రామములో వేంచేసియున్న శ్రీగంగాపార్వతీ సమేత శ్రీ శ్రీ శ్రీ సోమేశ్వరస్వామివారి దేవాలయమున అనాదినుండియు బ్రహ్మశ్రీ తంగిరాల ఆంజనేయశాస్త్రిగారిచే ఆర్ద్రోత్సవము జరుపబడుచున్నది. ఇటీవల నేను రుధిరోద్గారి సంవత్సరమునుండి ఆ ఉత్సవము యథాశక్తిగ, శాస్త్రోక్తవిధానమున పంచామృతముల (ఆవుపాలు, పెరుగు, నెయ్యి, తేనె, శర్కర) చేతను, ఫలరసము, తైలము, పన్నీరు, గంధోదకము, చెరకురసము మొదలగువానిచేతను, మహాన్యాసపూర్వక ఏకాదశరుద్రవారాభిషేకము, బిల్వార్చనయు, కల్పిత కైలాసగిరిమీద ప్రదోషసమయమున కైలాసద్వారదర్శనము, గ్రామోత్సవము, పండిత ప్రకాండులచే ఆర్ద్రోత్సవ, శివ మహిమలకు సంబంధించిన పురాణ, ఉపన్యాస, హరికథా కాలక్షేపములు జరుపుచుంటిని.

ఆర్ద్రోత్సవ వ్రతవిధాన మహిమలు వివిధగ్రంథముల నుండి సంగ్రహించి ప్రస్తుతగ్రంథమున సమీక్షింపబడినది. ఆయా గ్రంథకర్తలకు నా హృదయపూర్వకాభివందనములు. ఈయార్ద్రోత్సవవ్రతవిధాన, మహిమాదులు శివతాండవవైభవము శివపురాణమందలి విద్యేశ్వరసంహితలో 5–10 అధ్యాయములలోను, సూతసంహితలోని ముక్తిఖండమందలి 8, 9 అధ్యాయములలోను చెప్పబడియున్నది. నాకోరికను మన్నించి సాధనగ్రంథమండలి వ్యవస్థాపకులు బ్రహ్మశ్రీ బులుసు సూర్యప్రకాశశాస్త్రిగారు పై శివపురాణ, సూతసంహితలలోని అధ్యాయములకు తాత్పర్యవిశేషార్థములు వ్రాసి యిచ్చినందు

లకును, ఈ గ్రంథము – వారి సాధనగ్రంథమండలి తరఫున ప్రచురించి, ప్రకటించి, ప్రచార మొనరించుటకు అంగీకరించి నందులకును నేనెంతయు కృతజ్ఞుడను. నా యీకృషి భక్తులకు శివానుగ్రహసంపాదనకై సహాయకారికాగలదని ఆశిస్తున్నాను. నా యీ ప్రథమ ప్రయత్నములోని లోపములు పాఠకులు మన్నింతురుగాక.

## ఆర్ద్రాభిషేక విధానము

| | |
|---|---|
| ప్రాతఃకాలము | నివేదన |
| విఘ్నేశ్వరపూజ | నీరాజనము |
| ఋత్విగ్వరణ | సపన |
| వేదపారాయణ | భస్మాభిషేకము |
| అభిషేకము | గంగాభిషేకము |
| తైలాభిషేకము | శుద్ధగంగాభిషేకము |
| క్షీరాభిషేకము | సహస్రబిల్వార్చన |
| దధ్యాభిషేకము | మనోనివేదన |
| పంచామృతాభిషేకము | నీరాజనము |
| మధురాభిషేకము | మంత్రపుష్పము |
| నారికేళోదకాభిషేకము | కైలాసద్వారదర్శనము |
| సుగంధాభిషేకము | గ్రామోత్సవము. |
| అన్నాభిషేకము | మధ్యాహ్నము |
| సహస్రబిల్వార్చన | పురాణ, ఉపన్యాసాదులు. |

ఇట్లు

బాపట్ల, 10–2–58

పార్వతీపరమేశ్వర పాదసేవకుడు,

బ్రహ్మాండం వేంకటలక్ష్మీనారాయణరావు

శ్రోత్రియందారు.

# నివేదన

భగవంతునిలీల లనంతములు. అతిచిత్రములు. ఏనాటి కేది యెటుల జరిపించునో ఎవరికిని తెలియదు. జగన్నాటక సూత్రధారి యగు పరమేశ్వరుడు కరుణాళువు. భక్తులను పరీక్షించి తనవారిగా గైకొనును. భగవంతుని పరీక్షకు నడుముకట్టి నిలచినవాడె భగవద్భక్తుడు. ఇట్టి భక్తులరుదు. ఉన్నవారును వ్యక్తము కారు. వ్యక్తమయ్యు నట్టివారు అంతయు నీశ్వరాధీన మందురు.

శివలీలలు బహుపురాణములందు వర్ణితములు. అందు ముఖ్యముగ శివపురాణము, సూతసంహిత, స్కాందపురాణాంతర్గత హాలాస్యమాహాత్మ్యము ప్రధానములు. శివలీలలగురించి గ్రంథముప్రచురించి పాఠకలోకమున కందించవలయునని చిరకాలవాంఛితము. అట్టికోరిక యీనాటికి 'శివతాండవ' రూపమున నెరవేరుచున్నందులకు ధన్యుడను. ఇందులకు—

శ్రీభావపురీ (బాపట్ల) వాస్తవ్యులు, వదాన్యులు, నిత్యము శివపూజాతత్పరులు, ఉదారులు శ్రోత్రియందారులు నగు బ్రహ్మశ్రీ బ్రంహ్మాండం వేంకటలక్ష్మీనారాయణరావు గారు ప్రధానకారకులు. సప్తసంతానములలో నొకటియగు కృతిప్రచురణమున వీరు ధన్యులైరి. పార్వతీపరమేశ్వరుల యెడ వీరికిగల భక్తి అనిర్వాచనీయము. శివకథాలీలలు వీను లందు ప్రవేశించిన పులకితగాత్రులై గద్గదకంఠముతో నానంద బాష్పములు కార్చుచు తన్మయులగుదురు.

శ్రీ వేంకటలక్ష్మీనారాయణరావుగారు ఆధ్యాత్మిక గ్రంథపఠనమున మిక్కిలి యాసక్తికలవారు. వారి ప్రేరణచే శివవ్రతములలోకెల్ల మేటియగు ఆర్ద్రోత్సవవ్రతవిధానము,

శివతాండవము, తత్సందర్శనమువలన కలుగు మహాఫలమును అభివర్ణించు శివపురాణమందలి విద్యేశ్వరసంహితలోని ఐదు మొదలు పదియవయధ్యాయమువరకును - సూతసంహిత యందలి ముక్తిఖండములోని అష్టమ, నవమాధ్యాయములును యథామతి మూలానువాదము చేసితిని. సూతసంహితయందలి రెండధ్యాయములలోని విశేషములను పూజ్యపాదులు శ్రీశ్రీశ్రీ నృసింహభారతీస్వామివారి యనుగ్రహమున విని, యిందు పొందుపరచితిని. ఇందులకు శ్రీ స్వామివారికి హృదయ పూర్వక నమస్కారములు. పాఠకు లిందలి గుణలేశమును గ్రహించి మన్నింతురుగాత—

ఈగ్రంథముద్రణకు శ్రీ వేంకటలక్ష్మీనారాయణరావు గారు సంపూర్ణసహకారముచేసి, మాసాధనగ్రంథమండలిలో నొకపుష్పముగా ప్రచురించుట కభిమానించి, నేచేయుకృషికి దోహదమిచ్చినందులకు శ్రీవారికి పార్వతీపరమేశ్వరులు ఇతోధిక భక్తిప్రపత్తులు, ఆయురారోగ్యఐశ్వర్యములు అనుగ్రహించుగాక యని ప్రార్థించుచుంటిని. సాధనగ్రంథమండలి సభ్యులు, పాఠకులు ఈగ్రంథమునుగ్రహించి నేచేయుకృషికి ఇతోధికముగా సహకరించగలందులకు కోరుచు, విశ్వసించుచు మీకరకమలములందు ఈశివతాండవమును ఉంచుచుంటిని.

తెనాలి,
హేమలంబి మాఘము

వినీతుడు,
బులుసు సూర్యప్రకాశశాస్త్రి

శ్రీ బాలాత్రిపురసుందర్యై నమః.

# సమీక్ష

ప్రపంచమున పరమేశ్వరారాధనమువల్ల సులభముగ ముక్తి నొందవచ్చును. అట్టి యీశ్వరారాధనము చేయుటలో ఆర్ద్రావ్రత మొకటియై యున్నది. శ్రీ సూర్యభగవానుడు ధనుర్లగ్నగతుండై యుండ (ధనుర్మాసమునందు) ఆర్ద్రానక్షత్రముగల రోజు ఈశ్వరారాధనమున కెంతయు ప్రశస్తము. ఏతదారాధన విధానమును, మహిమయును అష్టాదశపురాణాంతర్గత శ్రీశైవపురాణమందలి విద్యేశ్వరసంహితయందునను, షట్సంహితోపేతంబయిన శ్రీ స్కాందపురాణాంతర్గత సూతసంహితయందలి ముక్తిఖండమునందునను, శంకరసంహితయందుగల శివరహస్యఖండమునను బహువిపులముగ గలదని శ్రీ సూతమహాముని శౌనకాదులకు పవిత్రమైన నైమిశారణ్యమున చెప్పెను.

శివార్చనయు, శివతాండవదర్శనము, ప్రదోషకాలమున మహాశివదర్శనమును, పంచాక్షరీమహామంత్రజపమును, ఇవన్నియును ఈ యార్ద్రావ్రతమునం దిమిడి యున్నవి. వీని యారాధనము వలన "ఏకక్రియా ద్వ్యర్థకరీ బభూవ" అను చందమున సర్వాభీష్టసిద్ధియు, శివసాయుజ్యమును కలుగును. పూర్వ మీ వ్రతంబాచరించి భక్తులనేకులు ముక్తి నొంది యున్నారు.

ఈ వ్రతమేర్పడిన సంవిధానము శివపురాణమందలి విద్యేశ్వరసంహితయం దీవిధముగా గలదు.

శ్రీ కైలాసపతియగు పరమేశ్వరుడు భక్తానుగ్రహార్థము లింగరూపముగా నవతరించెను. ప్రపంచము శివలింగరూపము. అట్టి శివలింగములలో ప్రధానముగా - సౌరాష్ట్రి

దేశమున (విరావల్‌లో) సోమనాథలింగము, శ్రీశైలమున మల్లిఖార్జునలింగము, ఉజ్జయినియందు మహాకాళలింగము, ఓంకారమున అమరేశ్వరలింగము, ప్రజ్వల్యయందు వైద్యనాథలింగము, డాకినీయందు భీమశంకరలింగము, సేతువుయందు రామలింగేశ్వరలింగము, దారుకావనమునందు నాగేశ్వరలింగము, వారణాసియందు విశ్వేశ్వరలింగము, నాసికయందు త్ర్యంబకలింగము, హిమాలయమందు కేదారలింగము, ఘుస్మేశ్వర (విశాలపురి) మందు ఘుస్మేశ్వర లింగము అను సుప్రసిద్ధ ద్వాదశజ్యోతిర్లింగములుగ శంకరు డావిర్భవించెను.♦

ఈ ద్వాదశలింగములుగాక — శ్రీకాంచీపురియందు పృధ్వీలింగముగ – ఏకామ్రేశ్వరలింగమును, జంబుకేశ్వరమున జలలింగముగ – జంబుకేశ్వరలింగమును, శ్రీకాళహస్తియందు వాయులింగముగ – శ్రీకాళహస్తీశ్వర లింగమును, శ్రీ అరుణాచలమునందు తేజోమయలింగముగ – అరుణాచలేశ్వరలింగమును, చిదంబరమున ఆకాశలింగముగ – చిదంబరేశ్వరలింగమును అవతరించెను. వీనినే పంచభూత మహాలింగము లందురు.

ఈ పంచమహాభూత లింగములలో తేజోమయలింగ ప్రాదుర్భావ సందర్భమున బ్రహ్మ విష్ణువులు మాయామోహితులై, వందనాది సంప్రదాయమర్యాదలలో నుభయులకు వాగ్వివాదము జరిగి, చిలికిచిలికి వానయైనచందమున యుద్ధము ప్రారంభమై, తుదకు భీకర ప్రచండయుద్ధముగా పరిణమించి లోకసంక్షోభ మేర్పడునటుల వారుభయులు భీకర

♦ శ్రీ ద్వాదశ జ్యోతిర్లింగముల వివరము, మార్గములు తెలుసుకొనదలచినవారు నాచే ప్రచురింపబడిన ప్రదోషాష్టకము చూడగోరెదను.

శస్త్రాస్త్రముల ప్రయోగించుస్థితిలో — లోకశాంతి నిమిత్తము పరమేశ్వరుఁడు రణరంగమున వారి యుభయులమధ్య నొక యనిలస్తంభముగ నావిర్భవించి బ్రహ్మ విష్ణువులచే బ్రయోగింపబడిన శస్త్రాస్త్రములను తనయందు లీనము చేసికొని ప్రపంచశాంతి జేకూర్చి లోకభీతినిమాన్పి లోకములరక్షించెను.

బ్రహ్మ విష్ణువులు తమమధ్య యావిర్భవించిన స్తంభమును జూచి యాశ్చర్యచకితమానసులై ఆ స్తంభముయొక్క యాద్యంతము లరయగోరి చతురాననుండు హంసవాహనారూఢుండై యాకసమునకును, విష్ణువు వరాహరూపమున పాతాళలోకమునకును జనసాగిరి. విష్ణువు శక్తియున్నంత వఱకు జని విసిగి ఆది కనలేక చింతతో తిరిగివచ్చెను. బ్రహ్మయు గగనమార్గంబున కొంతదూరం బరిగి పైనుండి క్రిందికి జారి పడుచున్న కేతకీపుష్పమునుగాంచి "ఓయీ! నీ వెచ్చటనుండి వచ్చుచుంటి" వని ప్రశ్నించెను. "ఈశ్వర శిరఃకంపనముచే బహుకాలమునుండి క్రిందికి జారిపడుచుంటెని." అదివిని బ్రహ్మ ఆశ్చర్యమానసుడై "నేను ఉపరిభాగమునకు వచ్చి చూచి నటుల విష్ణునెదుట నీవు సాక్ష్యము చెప్పవలసిన"దని కోరినందున కేతకీకుసుమము అందులకుసమ్మతించ వారుభయులుకలసి క్రిందికి వచ్చిరి. మహావిష్ణువు నెదుట కేతకీసుమము "బ్రహ్మ ఉపరిభాగమునకు వచ్చినా" డని అసత్యము పలికెను. అంతట స్తంభమునుండి పరమేశ్వరు డావిర్భవించెను. బ్రహ్మ విష్ణువులు పరశివుని భక్తితో నర్చించి స్తుతించిరి. పరశివుడు సంతుష్టుడై తనకువలె విష్ణుమూర్తికిని దివ్యక్షేత్రములయందు, నగరముల యందు, దేవాలయముల యందును ఉత్సవములు జరుగగల వని ప్రసాదించెను. బ్రహ్మకు పూజార్హత లేకుండునట్లున్న,

కూటసాక్ష్యము చెప్పిన కేతకీకుసుమమును దేవపూజ కర్హత లేకుండునటులయు శాసించెను. పిమ్మట భైరవుని సృష్టించి, అసత్యము పలికిన బ్రహ్మ పంచమశిరమును ఖండింపజేసెను. పిమ్మట బ్రహ్మ, దేవతలును శివుని బహువిధముల స్తుతించి, బ్రహ్మ – కేతకీసుమముల తప్పులను మన్నించి యనుగ్రహింపు డని వేడగా, పరమేశ్వరుడు అనుగ్రహించి "యాగాదిక్రతువు లందు బ్రహ్మకు స్థానముండునటులయు, కేతకీకుసుమమునకు పరమేశ్వరుని శిరస్సున కుపరిభాగమున అలంకరించుట కుప యోగపడునటులయు వరమిచ్చెను".

పిమ్మట బ్రహ్మ విష్ణువు దేవతలు పరమేశ్వరుని భక్తితో నర్చింపగా, శివుడు కరుణించి, ప్రసన్నుడై " మీయుభయుల మధ్య జ్యోతిర్లింగ స్వరూపమున ప్రాదుర్భవించిన ఈ సమ యము ఆర్ద్రానక్షత్రమనియు, మీరు పూజించిన యీదినమే మహాశివరాత్రియనియు పలికి, ఈ ఆర్ద్రానక్షత్రసమయమున నన్ను (ఉమాదేవితో) దర్శించినవారు కార్తికేయునికంటెను నాకు మిక్కిలి ప్రియతములనియు, పూజించిన మిక్కిలి యధిక మనియు, సాగరమునకు చంద్రోదయమువలె శైవవ్రతము లకు శివరాత్రి శ్రేష్ఠతమముగా విఖ్యాతిగాంచుననియు వరము ప్రసాదించి, భవిష్యత్కాలమున భక్తానుగ్రహార్థము ఈ స్తంభము సూక్ష్మరూపమున అరుణాచల క్షేత్రమున తేజోమయలింగ ముగా నుండుననియు, సేవించినవారికి భుక్తిముక్తులు కలుగు ననియు చెప్పి" యంతర్ధానము నందెను.

ఆర్ద్రా నక్షత్రమున విశేషించి రవివారయుతమగు ఆర్ద్రానక్షత్రమున శివునిపూజించిన విశేషఫలము కలుగును. రవివారయుక్త ఆర్ద్రానక్షత్రమునకు "మహార్ద్ర"యని పేరు.

జ్యేష్ఠమాసమున మహార్ద్రా నక్షత్రయుక్తమైన చతుర్దశియందు శివుని పూజించిన ఆయుర్వృద్ధియు, సకలాభీష్టసిద్ధియు సిద్ధించును. మార్గశిరమున పూజయు, పాదదర్శనము భోగమోక్షముల కలుగజేయును. —స్కాందము, బ్రహ్మోత్తరఖండము

ఈ దినమంతయు సుదినమే. అందును ప్రదోషకాలము విశేషించి శ్రేష్ఠము. (ప్రదోషమున సూర్యోదయాది, సూర్యాస్తమయాది సంధికాలము) అట్టి సమయమున పరమశివుడు తాండవము చేయుచుండును.

శ్లో॥ కైలాసశైలభవనే త్రిజగజ్జనిత్రీం
గౌరీం నివేశ్య కనకాంచితరత్నపీఠే।
నృత్యం విధాతు మభివాంఛతి శూలపాణౌ
దేవాః ప్రదోషసమయేను భజంతి సర్వే॥

శ్లో॥ వాగ్దేవీ ధృతవల్లకీశ తమఖో వేణుం దధత్పద్మజ
స్తాలోన్నిద్రకరో రమాభగవతీ గేయప్రయోగాన్వితా,
విష్ణు స్సాంద్ర మృదంగవాదనపటు ర్దేవా స్సమంతాత్ స్థితా
స్సేవంతే తమనుప్రదోషసమయే దేవం మృడానీపతిమ్॥

శ్లో॥ గంధర్వ యక్షపతగోరగ సిద్ధ సాధ్య
విద్యాధరామర వరాప్సర సాంగణాశ్చ,
యేన్యే త్రిలోకనిలయా స్సహభూతవర్గాః
ప్రాప్య ప్రదోషసమయే హరపార్శ్వ సంస్థాః.

శ్లో॥ అతః ప్రదోషే శివ ఏక ఏవ
పూజ్యో థనాన్యే హరిపద్మజాద్యాః,
తస్మి న్మహేశే విధినేజ్యమానే
సర్వే ప్రసీదంతి సురాధినాథా॥

సీ. కైలాసగిరిమీద, గౌలకంఠుని
దివ్య హాటకరత్న సింహాసనమున
నద్రిజ నుంచి మహాప్రదోషంబున
సకలదేవర్షులు సన్నుతింప
వాణీ మహాదేవి వీణ మీటుచునుండ
కమలసంభవుడు తాళములునైవ
దానవాంతకుడు మృదంగవాద్యము సల్ప
శ్రీలక్ష్మి గానంబు సేయుచుండ
తే. వాసవుడు వైభవోన్నత స్వరముగూర్ప
గరుడ గంధర్వ యక్ష కిన్నర పతంగ
సిద్ధ విద్యాధరాధిపు లేచ్చరిగొలువ.
హర్ష మిగురొత్త దాండవం బాడుచుండు.

ఆ. ఆ ప్రదోషమునను హరు డొక్కరుడు దక్క
బూజ్యు లెవరు లేరు భూతలమున
ఆ మహానుభావుం డర్చింతుడైన
ప్రసన్నులగుదు రెపుడు సకలసురులు.

ఈ శివతాండవమును గురించి స్కాందపురాణాంతర్గత బ్రహ్మోత్తరఖండమున వర్ణింపబడియున్నది.

ప్రదోషసమయమున శివునిగాక యితర దైవములను సేవించినను, దర్శించినను సప్తజన్మములలో నార్జించిన సుకృతము హరించును. — శివతత్త్వ సుధానిధి.

శ్లో॥ ప్రదోషే యో మమస్థానం గత్వా పూజయతే తు మామ్।
సపరాం శ్రియ మాప్నోతి పశ్చాన్మయి విలీయతే॥
— శివగీత 15 - 32.

ప్రదోషకాలమున శివాలయమునకు బోయి అచ్చట నన్ను బూజించినవా డుత్తమైశ్వర్యమును బొంది యంత్యమున నాలో నైక్యమందును.

శ్లో॥ స ఏవ లభతే జ్ఞానం మద్భక్త శ్రద్ధయాన్వితః।
నాన్యకర్మాణి కుర్వాణో జన్మకోటి శతైరపి॥ శివగీత 14-41

కోటిజన్మలచేతనైనను ఇతర కర్మలు చేయక శ్రద్ధతో గూడిన నాభక్తుడే జ్ఞానమును బొందును.

శ్లో॥ అష్టమ్యాం చ చతుర్దశ్యాం పర్వణో రుభయోరపి. 33
భూతి భూషిత సర్వాంగో యః పూజయతి మాం నిశి।
కృష్ణపక్షే విశేషేణ స మే భక్త స్స మే ప్రియః॥
— శివగీత, 15 - 34.

అష్టమీ చతుర్దశులయందు భస్మమును బూసుకొని రాత్రులు నన్నర్చించువారలు ముఖ్యభక్తులు. కృష్ణపక్షమం దైన నింకను విశేషముగా నాపూజ ఫలమిచ్చును.

శ్లో॥ ఏకాదశ్యా ముపోష్యైవ యః పూజయతి మాం నిశి।
సోమవారే విశేషేణ నమే భక్తో న నశ్యతి॥
— శివగీత. 15 - 35.

సోమవారంబునను ఏకాదశియందు నుపోష్యముచేసి రాత్రుల నన్ను బూజించిన భక్తుని కెన్నడును చెఱుపులేదు.

శ్లో॥ శుక్లపక్షే చతుర్దశ్యా మష్టమ్యాం వా విశేషతః।
ఏకాదశ్యాం సోమవారే ఆర్ద్రాయాం వా సమారభేత్ ॥20

శుక్లపక్షంబున చతుర్దశియందు కాని, యష్టమియందు గాని యేకాదశినాడు కాని ఆర్ద్రానక్షత్రయుక్త సోమవారమున గాని యీ పాశుపతవ్రతము నారంభింపవలెను.

వ్రతము లన్నింటికంటె ప్రదోషవ్రతము ఋణత్రయములనుండి విముక్తునిజేసి ఐశ్వర్యము నొసంగును. పూర్వమొక రాజుకు పరమేశ్వరానుగ్రహమువలన మణిభద్రప్రసాదితంబైన చింతామణివల్ల ఐశ్వర్యము గలుగ, అందులకు అతని శత్రువు గినిసి "మెత్తనివానిని చూచిన మొత్తబుద్ధిపుట్టు చందంబున" రాజుమీదికి యుద్ధంబునకు రాగా, ప్రదోషవ్రతాచరణముచే రాజు తన శత్రువును నిర్జించెను. ఈ ప్రదోషసమయమున రాజుచేయు శివార్చన ఒక గొల్లపిల్లవాడు చూచి, తానును జేయగా నాతనికుటుంబమున అష్టమ సంతతిగా నందుడును, ఆతని గర్భమున శ్రీకృష్ణుడును అవతరించి లోకమును, మీ కులమును ఉద్ధరించుదునని చెప్పెను. ప్రదోషవ్రత మన మాసమందలి శుక్ల, కృష్ణపక్షముల త్రయోదశి తిథి.

—బ్రహ్మోత్తరఖండము

ఆర్ద్రా నక్షత్రముగల రోజు శివునకు పరమప్రీతికరముగాన, నాడు భక్తితో పంచామృతములతోడను, సుగంధద్రవ్యములతోడను, పరిశుద్ధజలముతోడను అభిషేకించి సేవించవలయును.

శ్లో॥ పయసా సర్పిషా చాపి మధునేక్షురసేన వా।
పక్వామ్రఫలజేనాపి నారికేళ జలేన వా।
గంధోదకేన వా మాం యో రుద్రమంత్రం సముచ్చరన్।
అభిషించేత్తతో నాన్యః కశ్చిత్ప్రియతమో మమ॥ 37,38

పాలు, నెయ్యి, తేనె, చెఱకుపానకము, మామిడిపండు రసము, నారికేళఫలోదకము, గంధోదకము వీనిలో నెద్దానిచే నైనను రుద్రమంత్రములతో నన్ను నభిషేకము చేసిన వాని కంటె నాకు ప్రియతముడు వేరొకడు లేడు.

అభిషేకానంతరము యథాశక్తి పంచాక్షరీ మంత్రము జపించవలయును. శివపంచాక్షరీమహిమయపారము. పూర్వము కాశీరాజుకు కళావతియను కన్యగలదు. ఆమె దుర్వాసునివలన పంచాక్షరీమంత్రదీక్ష బొందెను. ఆమెకు యుక్తవయసురాగా తండ్రి మహిముడను రాజునకిచ్చి వివాహము చేసెను. మహిముడు కళావతిని స్పృశింప భరించలేనంత యుష్ణముగా నామె దేహముండెను. మహిము డాశ్చర్యముతో కళావతిని ప్రశ్నింప యామె "నేను పంచాక్షరీదీక్ష పొందియుంటిని. దానిప్రభావ మిది" యని పలికి భర్తను గర్గమహామునియొద్దకు తీసికొనివెళ్లి, యామునివలన నతనికి పంచాక్షరీదీక్ష యిప్పించెను. పిమ్మట వారన్యోన్యానురాగముతోనుండ, వారివంశమున మహావిష్ణువు శ్రీకృష్ణుండనుపేర నవతరించి 'మీ కులంబును, మిమ్మును పావనంబుచేయుదు' నని పలికెను. —బ్రహ్మోత్తరఖండము

ఇట్టి మహిమాన్వితమైన శివపంచాక్షరీ మహామంత్రమును ఆంధ్రులలో బాలురకు అక్షరాభ్యాస ప్రారంభముననే గురూపదేశము చేయించుచుండిరి. వారి అదృష్టము నెంతని వచింపగలము? ఆభాగ్యము తమకు లేకపోయెనని అప్పయ్యదీక్షితులవారు విచారపడినటుల జనశ్రుతి.

సూర్యభగవానుడు ధనుర్లగ్న గతుడైయుండ ఆర్ద్రానక్షత్రము వచ్చిన దినమున భగవద్భక్తులగువారు ఉషస్సమయమున నిద్రలేచి, వర్ణాశ్రమోచితములైన నిత్యకృత్యములు దీర్చుకొని, స్వస్వరూపానుసంధానంబున గలిగిన మహానందమునుసూచించెడి యఖండతాండవముసల్పుచుండు నటరాజుం దలంచుచు శివాలయమునకేగి, పాత్రులకు యథాశక్తి దానములొసంగి, యథాశాస్త్రముగ స్వామికి మహాన్యాసపూర్వక

మైన ఏకాదశ రుద్రాభిషేకం బొనర్చి, సుగంధ ధూపముల తోడను అఖండదీపారాధనలతోడను మహానైవేద్యములతోడను కర్పూర తాంబూలంబులతోడను ఆనందనీరాజనంబులతోడను సువర్ణదివ్యమంత్ర పుష్పంబులతోడను దేవోపచార రాజోపచారంబులతోడను భగవత్కైంకర్యమును త్రికరణశుద్ధిగనొనర్చి స్వగృహమునకు వచ్చి యీదినమెల్ల నుపవసించి, రాత్రి సత్కథా కాలక్షేపములతో జాగరణం బొనర్పవలయును. మఱుదినమున షడ్రసోపేత భోజనాదులచే సాధుజన సంతర్పణముజేసి పిదప తాము పారణ మొనర్పందగు. ఇట్లాచరించిన వా రైహికాముష్మిక సౌఖ్యము లనుభవించి, శివతాండవమును కన్నులారగాంచి మోక్షము జూఱగొందురు.

పూర్వము ముంచకేశుండను మహర్షి యొకడుండెను. అతడు నటేశ్వరుని తాండవమును దర్శించి కృతార్థతగాంచెను. అట్టి మహాఫలము లభించుటకు ఆర్ద్రోత్సవ మహాకైంకర్యము ముఖ్యసాధనమని శాస్త్రములవలన దెలిసికొని అది త్రికరణ శుద్ధిగ నాచరించెను. దాని మహిమచే నమ్ముని కనులపండువుగ శివతాండవము జూచి ముక్తుండయ్యెను.

షట్శాస్త్రములలో నొక్కటియగు యోగశాస్త్రమును ప్రవర్తింపజేసిన పతంజలి మహర్షి ధనుర్మాసమునం దీయార్ద్రోత్సవ కైంకర్యమును శివప్రీతికై భక్తి శ్రద్ధా విశ్వాసములతో సలిపెను. ఆ మహిమచే నమ్మునీంద్రునకు తాండవేశ్వరుని యుద్దండ తాండవవిలాసమును దర్శించుట సమకూడెను. అణిమాది సిద్ధుల కా తాపసుం డాస్పదమయ్యెను. బహువిధములైన యోగవిభూతుల నయ్యోగి దర్శించి కైవల్యము జూఱగొనెను.

ఈ యాత్ర్రోత్సవమున కధిదేవత రుద్రుడు. ఈరుద్రా రాధనమును గర్కోటకుడను ఫణీంద్రుం డాచరించి నటేశ్వర స్వామివారి మహానాట్యము నేత్రానందముగచూచి సర్వాభీష్ట సిద్ధులం బడసి జరామరణరహితంబైన శివసాన్నిధ్యం బందెను.

— శివరహస్యఖండము.

శౌనకమహాముని తాండవేశ్వరుని లీలా తాండవవైభవ మును సందర్శించి తరించవలెనను కుతూహలముతో శివభక్తాగ్రేసరుండగు నందికేశ్వరుని సన్నిధికేగి ''స్వామీ! నటరాజ మహానటనము దర్శించుభాగ్యము నాకు గలుగునట్లు కృపచేయ వలె''నని యడిగెను. నందికేశ్వరుండును మిగుల పరిశీలించి దానికి ముఖ్యసాధనమగు యాత్ర్రోత్సవసేవను శివభక్తుండగు శౌనకున కుపదేశించె. శాస్త్రోక్తరీతితో దాని నాత డాచరింప నటేశ్వరుం డఖండతాండవోత్సాహమండితంబైన దివ్యరూపం బుతో సాక్షాత్కరించెను. శౌనకుండును తద్దర్శనానంద పార వశ్యంబున నృత్యమొనర్చి ఈశ్వరునిమెప్పించి శాఖాసూత్రప్రవ ర్తకుండయ్యెను. ఈ ముని శిష్యు డాశ్వలాయనుడు సైత మీ సంప్రదాయముచేతనే కృతార్థుడై మహామహిమ లాచరించెను.

సూతుడు మునుల సభలో నీ యాత్ర్రోత్సవ మహిమ నుపన్యసించుచుండ దాని సత్యమును నిరూపించుటకై శ్రీవ్యాస భట్టారకుం డావిర్భవించి, మునిబృందములచే సేవింపబడుచు, దాండవేశ్వర క్షేత్రంబుజేరి, శాస్త్రోక్తవిధానంబున నాత్ర్రోత్సవ దీక్ష నవలంబించి, యమోఘ ఘటన లీలావిలాస విశేషంబుల నశేష జగన్నాటకసూత్రధారిత్వమును బోధించు పరమేశ్వరుని దివ్యరూపముం బొడగాంచి, దివ్యస్తోత్రము లొనర్చి, తాను ధన్యుడై ఋషుల ధన్యుల నొనర్చెను.

సీ. శంభు బూజించు హస్తములు హస్తంబులు
శితికంఠు కథవిన్న శ్రుతులు శ్రుతులు
శివవందనముజేయు శీర్షంబు శీర్షంబు
ప్రమథేశు గీర్తించు రసనరసన
చిత్తజారి భజించు చిత్తంబు చిత్తంబు
దేవదేవు నెఱుంగు తెలివి తెలివి
భవునకు వలగొన్న పదములు పదములు
త్రిపురాంతకునిజూచు దృష్టి దృష్టి
తే. భూతనాథునిపైగల బుద్ధి బుద్ధి
భర్గు మహిమల నుడివిన పలుకు పలుకు
విశ్వనాథుని దెలిపెడు విద్య విద్య
హరునియెడ భక్తిగలిగిన నరుడు నరుడు.

మరియు మార్గశిరమున ఆర్ద్రతో కూడినపూర్ణిమ ఆర్ద్రయనబడును. పూర్ణిమకు అధిపతి చంద్రుడు. ఆర్ద్రకు అధిపతి రుద్రుడు. ఆర్ద్ర జలనక్షత్రము. ఈశ్వరుడు అభిషేకప్రియుడు. ఈశ్వరుడు చంద్రధరుడు. ఈశ్వరుని ఇరువదియైదు యవతారములలో సోమధారి ప్రథమావతారము. ఈ రీతిగా శివుని గురించి యనేకవిశేషములు గలవు. ధనుస్సున రవిప్రవేశించిన పిమ్మట పూర్ణిమనాడు చంద్రుడు మీనరాశిగతుడగును. కాగా పూర్ణిమనాడు రవిచంద్రులుఎదురబడుటయు నొకవిశేషము.

పూర్వము విదర్భదేశాధిపతియగు సత్యమహారాజు పూర్వకర్మవిశేషమున రాజ్యభ్రష్టుడై యుద్ధమున శత్రువులచే నిర్జితుడై చనిపోయెను. నాటికె గర్భవతియగు నతనియర్ధాంగి ఆత్మరక్షణకై శత్రువులబారినుండి తప్పించుకొని అడవులపాలై అడవిలో నొకసరోవరసమీపమున ప్రసవించెను. పుత్రోదయ

మయ్యెను. ఆపె దాహపీడితయై కొలనులో ప్రవేశించగ మొసలిచే నిహతురాలాయెను. ఆమెకు కలిగినపుత్రుడు కాలాంతరమున నొక బ్రాహ్మణవితంతువుచే పోషింపబడుచుండ ఒకనాడు శాండిల్యమహాముని దర్శనమున పూర్వకర్మ తెలిసికొని తద్దోషనివారణార్థము ప్రదోషవ్రతము సలుప, రాజకుమారుడు పూతుడై ఐశ్వర్యవంతుడై సుఖించెను.

శ్లో॥ తస్మా న్మ్ముముక్షు ర్మాం విష్ణు రపి త్యక్త్వా మహేశ్వరమ్।
ఆశ్రయే త్సర్వభావేన ప్రసాదం కురు తేహి సః॥

— బ్రహ్మగీత 130.

"మోక్షమును గోరువారు నన్ను, విష్ణువుని విడచి శివుని యాశ్రయించవలయును." అని బ్రహ్మ యనెను.

"మాసానాం మార్గశీర్షోఽహం" అని భగవద్గీతలో చెప్పబడినది.

ఇట్టి ఆర్ద్రామహోత్సవ సమయమున, చిదంబరమున స్వామినిదర్శించి, సేవించిన హరిజనభక్తుడు 'నందనార్'— మరియు నైశ్యస్త్రీయును ముక్తిని బడసిరి. కాగా ముక్తికి సులభసాధ్యము ఈశ్వరసేవ. అందును "ఆర్ద్ర, మహాశివరాత్ర" వ్రతదీక్ష మిక్కిలి విశేషము. ఆగమశాస్త్రప్రకారము ఆర్ద్ర నాడు పార్వతి రజస్వలయైన శుద్ధిదివసమని శాంతి హోమాదులుగూడ గావింతురు.

— బ్రంహ్మాండం వేంకటలక్ష్మీనారాయణరావు.

నమశ్శివాయై చ నమశ్శివాయ

# శివతాండవము

## షష్ఠోఽధ్యాయః

నందికేశ్వర ఉవాచః—

పురా కదాచి ద్యోగీంద్ర! విష్ణు ర్విషధరాసనః।
సుష్వాప పరయా భూత్యా స్వానుగై రపి సంవృతః॥ ౧

నందికేశ్వరు డిట్లు చెప్పెను. ఓ యోగివర్యా! పూర్వ మొకప్పుడు విష్ణువు తన యనుచరులతో గూడ మహైశ్వర్య సంపన్నుడై శేషశయనమున శయనించియుండెను.

యదృచ్ఛయా గత స్తత్ర బ్రహ్మా బ్రహ్మవిదాంవరః।
అపృచ్ఛ త్పుండరీకాక్షం శయానం సర్వసుందరమ్॥ ౨

బ్రహ్మవేత్తలయం దగ్రగణ్యుడగు బ్రహ్మ యచ్చట కెందులనో వచ్చి సర్వసుందరుడై శయనించియున్న పుండరీ కాక్షుని గాంచి యిట్లడిగెను.

క స్త్వం పురుషవచ్ఛేషే దృష్ట్వా మా మపి దృప్తవత్।
ఉత్తిష్ఠ వత్స! మాం పశ్య తవనాథ మిహాగతమ్॥ ౩

నన్ను జూచియును గర్వితునివలె శయనించియుండు నీ వెవరవు? హేవత్స! నీకు ప్రభుండనైన నే నిచ్చటకు వచ్చితిని. ఉత్థితుడవై కనుగొనుము.

ఆగతం గురు మారాధ్యం దృష్ట్వా యో దృప్తవ చ్చరేత్।
ద్రోహిణ స్తస్య మూఢస్య ప్రాయశ్చిత్తం విధీయతే॥ ౪

పూజనీయుడగు గురువర్యుని రాకను గాంచియు గర్వితునివలె సంచరించు గురుద్రోహియగు మూర్ఖునకు ప్రాయశ్చిత్తము విధింప బడుచున్నది.

ఇతి శ్రుత్వా వచః కృద్ధో బహి శ్శాంతవ దాచరత్।
స్వస్తి తే స్వాగతం వత్స! తిష్ఠ పీఠ మితోఽవిశ॥ ౫
కిము తే వ్యగ్రవ ద్వక్త్రం విభాతి విషమేక్షణమ్।

ఈమాటలను విని విష్ణువు కోపించియు శాంతభావమును ప్రకటించుచు నిట్లనెను. హేవత్స! నీకు మంగళ మగుగాక! ఈ యాసనమున గూర్చుండుము. నీముఖమున వ్యగ్రతయు కన్నులందు విపరీతభావములును గోచరించు చున్న వేమి?

బ్రహ్మోవాచ:—

వత్స! విష్ణో! మహామాన మాగతం కాలవేగతః॥ ౬
పితామహశ్చ జగతః పాతా చ తవవత్సక!

బ్రహ్మ యిట్లనెను. హేవత్స విష్ణూ! కాలవశమున విపరీతక్రోధము జనించినది. నేను సర్వజగత్పితామహుడను. నీకు ప్రభుండను.

విష్ణురువాచ:—

మత్స్థం జగదిదం వత్స! మనుషే త్వం హి చోరవత్॥ ౭
మ న్నాభికమలా జ్జాతః పుత్ర స్త్వం భాషసే వృథా

హేవత్స! ఈ జగమంతయు నాయందే యుండ, దొంగవలె "నేను జగత్పితామహుండ" ననుదువేమి? నీవు నా నాభికమలమునుండి జన్మించిన కుమారుడవై యుండి వ్యర్థాలాపముల ప్రసంగించుచుంటివి.

నందికేశ్వర ఉవాచ :—

ఏవం హి వదతో స్తత్ర మగ్ధయో రజయో స్తదా। ౮

అహమేవ వరో నత్వ మహం ప్రభు రహం ప్రభుః।

పరస్పరం హన్తు కామా చక్రతు స్సమరోద్యమమ్॥ ౯

ఇట్లు మోహవశులై బ్రహ్మయు విష్ణువును నేనే శ్రేష్ఠుడను. నీవు కావు. నేనే ప్రభుడను. నేనే ప్రభుడను. అని పలుకుచు నొండొరు నొకరు చంపనుద్దేశించి యుద్ధమునకు గడంగిరి.

యుయుధాతేఽ మరౌ వీరౌ హంసపక్షీంద్రవాహనౌ।

వైరం చ్యావైష్ణవా శ్చైవం మిథో యుయుధిరే తదా॥ ౧౦

హంసవాహనుడై బ్రహ్మయు, గరుడవాహనుడై విష్ణువును యుద్ధమునకు దలపడిరి. బ్రాహ్మణగణములు, వైష్ణవగణములుకూడ అన్యోన్యము యుద్ధముచేయ దొడగెను.

తావ ద్విమానగితయ స్సర్వా వై దేవజాతయః।

దిదృక్షవ స్సమాజగ్ము స్సమరం తం మహాద్భుతమ్॥ ౧౧

క్షిపంతః పుష్పవర్షాణి పశ్యంత స్సైన్వరి మంబరే।

అంత విమానారూఢులై దేవతలందఱు నాయాశ్చర్యజనకమగు యుద్ధమును జూచుటకేతెంచి, యంబరతలము నుండి పుష్పవర్షము గురియింప దొడంగిరి.

సుపర్ణవాహన స్తత్ర క్రుద్ధో వై బ్రహ్మవక్షసి॥ ౧౨

ముమోచ బాణా నసహా నస్త్రాంశ్చ వివిధా న్బహూన్।

గరుడవాహనుడగు విష్ణువంత క్రుద్ధుడై సహింపరాని అస్త్రశస్త్రముల నసంఖ్యాకముగ బ్రహ్మవక్షమున నాటెను.

ముమోచాథ విధిః క్రుద్ధో విష్ణో రురసి దుస్సహాన్॥ ౧౩
బాణా ననలసంకాశా నస్త్రాంశ్చ బహుశ స్తదా।

అంత బ్రహ్మయు గోపించి విష్ణువక్షమునం దగ్నిసన్నిభములు దుస్సహములు నగు ననేకాస్త్రశస్త్రముల బ్రయోగించెను.

తదాశ్చర్య మితి స్పష్టం తయో స్సమరగోచరమ్॥ ౧౪
సమీక్ష్య దైవతగణా శ్శశంసు ర్భృశ మాకులాః।

ఆశ్చర్యకరమగు నా విరించిమాధవుల సమరవృత్తము నవలోకించి దేవతలందఱు వ్యాకులచిత్తులై వారిని గొనియాడిరి.

తతో విష్ణు స్సుసంక్రుద్ధ శ్శ్వాస న్వ్యాసన కృతః॥ ౧౫
మాహేశ్వరాస్త్రం మతిమా న్సందధే బ్రహ్మణోపరి।

అంత బుద్ధిమంతుడగు విష్ణువు నొచ్చి నిశ్వసించుచు, మిక్కిలికోపించి, బ్రహ్మదేవు నుపలక్షించి మాహేశ్వరాస్త్రమును సంధించెను.

తతో బ్రహ్మ భృశం క్రుద్ధః కంపయ న్విశ్వమేవహి॥ ౧౬
అస్త్రం పాశుపతం ఘోరం సందధే విష్ణువక్షసి।

అంత బ్రహ్మయు మిక్కిలికోపించి విశ్వమును గంపింపజేయుచు భయంకరమైన పాశుపతాస్త్రమును విష్ణువక్షము లక్ష్యముగా బ్రయోగించెను.

తత స్తదుత్థితం ఘోరం తపనాయుత సన్నిభమ్॥ ౧౭
సహస్రముఖ మత్యుగ్రం చండవాతభయంకరం।
అస్త్రద్వయ మిదం తత్ర బ్రహ్మవిష్ణ్వో ర్భయంకరమ్॥ ౧౮

ఇత్థం బభూవ సమరం బ్రహ్మవిష్ణ్వోః పరస్పరం।

అప్పు డయుతసూర్యసన్నిభములై సహస్రముఖముల నుగ్రములై యొప్పు బ్రహ్మవిష్ణువుల యస్త్రములు లాకాసమున కెగసి ప్రచండవాయువులను నిర్గమింపజేయుచు నతిభయంకరములై గోచరించెను. ఇట్లు బ్రహ్మవిష్ణువుల కన్యోన్యము యుద్ధముజరిగెను.

తతో దేవగణా స్సర్వే విషణ్ణా భృశ మాకులాః॥ ౧౯
ఊచుః పరస్పరం తాత! రాజక్షోభే యథా ద్విజాః।

ఓ సనత్కుమారా! అంత దేవతలందఱు రాజక్షోభ సమయమున ద్విజగణములవలె కలవరపడి విషణ్ణచిత్తులై యన్యోన్య మిట్లు పలుకదొడగిరి.

సృష్టి స్స్థితి శ్చ సంహారో తిరోభావో ఽ ప్యనుగ్రహః॥ ౨౦
యస్మా త్ప్రవర్తతే తస్మై బ్రహ్మణే చ త్రిశూలినే।
అశక్య మన్యై ర్యదనుగ్రహం వినా
తృణక్షయోప్యత్ర యదృచ్ఛయా క్వచిత్॥ ౨౧
ఇతి దేవాభయం కృత్వా విచిన్వంత శ్శివక్షయం।
జగ్ముః కైలాస శిఖరం యత్రాస్తే చంద్రశేఖరః॥ ౨౨

సృష్టిస్థితిలయతిరోభావానుగ్రహము లెవనిచేతం బ్రవర్తితము లగుచుండెనో, ఎవని యనుగ్రహము లేక తృణమునైన నశింపజేయుట కన్యుల కెన్నడును సాధ్యముకాదో అట్టి పరబ్రహ్మస్వరూపుడగు శూలపాణికి నమస్కారము. అని సదా శివుని ధ్యానించుచు చంద్రశేఖరుని నివాసమగు కైలాస శిఖరమున కేగిరి.

దృష్ట్వైవ మమరా హృష్టాః పదం తత్పారమేశ్వరమ్।
ప్రణేముః ప్రణవాకారం ప్రవిష్టా స్తత్ర సద్మని॥ ౨౩

ఇట్లు దేవతలందఱు శంకరస్థానమును దర్శించి, ప్రణవాకృతినున్న శివభవనమున బ్రవేశించి, ప్రహృష్టాంతఃకరణులై ప్రణమిల్లిరి.

తేఽపి తత్ర సభామధ్యే మండపే మణివిష్టరే।
విరాజమాన ముమయా దదృశు ర్దేవపుంగవమ్॥ ౨౪

వారచ్చట సభామధ్యమున మణిమయాసనమున పార్వతీసహితుడై విరాజిల్లు దేవదేవుని దర్శించిరి.

సవ్యోత్తరేతరపదం తదర్పిత కరాంబుజం।
స్వగణై స్సర్వతోజుష్టం సర్వలక్షణలక్షితమ్॥ ౨౫
వీజ్యమానం విశేషజ్ఞైః స్త్రీజనై స్తీవ్రభావనైః।
శస్యమానం సదావేదై రనుగృహ్ణాంత మీశ్వరమ్॥ ౨౬

దృష్ట్వైవ మీశ మమరా స్సంతోషసలిలేక్షణాః।
దండవ ద్ధారతో వత్స! నమ శ్చక్రు ర్మహాగణాః॥ ౨౭

హేవత్స! వామచరణోపరిభాగమున దక్షిణపాదమును తదుపరిభాగమున వామకరకమలమును జేర్చి యుండి, సర్వశుభలక్షణశోభితుడై శైవగణములు నలువంకల బరివేష్టించి యుండ విశేషజ్ఞులును, తీవ్రభక్తిభావసమన్వితలు నగు రమణీమణులు వీచుచుండ వేదములచేస్తుతింపబడుచు సర్వానుగ్రహాకారియై వెలయు నాపరమేశ్వరుని సందర్శించి, దేవతలందఱు

నయనముల నానందాశ్రులు తొలుకాడ దూరమునుండియే సాష్టాంగ దండప్రణామములు లాచరించిరి.

తా నవేక్ష్య పతిర్దేవా న్సమీపే చాహ్వాయ ద్గణైః।
అథ సంహ్లాదయ న్దేవా న్దేవో దేవశిఖామణిః॥ ౨౮
ఉవాచ దర్థ గంభీరం వచనం మధుమంగలమ్॥

ఇతి శ్రీ శివమహాపురాణే విద్యేశ్వరసంహితాయాం షష్ఠోఽధ్యాయః॥

దేవశ్రేష్ఠుడగు నాశంకరుడా దేవతల గాంచి ప్రమథ గణములచే సమీపమునకు బిలిపించి, అర్థగంభీరంబులును, శుభమధురంబులు నగు వచనంబుల నిట్లనెను.

ఇది శ్రీ శివమహాపురాణమువ విద్యేశ్వరసంహితయందు
ఆఱవ అధ్యాయము.

—::—

## సప్తమోఽధ్యాయః

ఈశ్వర ఉవాచ:—

వత్సకాః స్వస్తి వః కశ్చి ద్వర్తతే మమ శాసనాత్।
జగచ్చ దేవతావంశః స్వస్వ కర్మణి కిం నవా॥ ౧

పరమేశ్వరు డిట్లు పలికెను.

ఓవత్సలారా! మీకు సేమంబేకద! నాశాసనము ననుసరించి, సర్వలోకములు, దేవతలు స్వకర్మాభిరతులై యున్నారా?

ప్రాగేవ విదితం యుద్ధం బ్రహ్మావిష్ణ్వో ర్మయాసురాః।
భవతా మభితాపేన పౌనరుక్త్యేన భాషితమ్॥ ౨

ఓ దేవతలారా! బ్రహ్మవిష్ణువుల యుద్ధ సమాచారము నాచే బూర్వమే తెలియబడినది. మీ యభితాపముచే (సంతాపంబున) నావిషయము పునరుక్తిగ చెప్పినట్లయ్యెను.

ఇతి సస్మితయా మాధ్వ్యా కుమారపరిభాషయా।
సమతోషయ దంబాయా స్సపతి స్తత్సురవ్రజమ్॥ 3

ఇట్లా పార్వతీపతియగు పరమేశ్వరుడు, మధురములైన వాక్కులచే బుత్ర వాత్సల్యంబున నా దేవతా నికరంబును దనియించెను.

అథ యుద్ధాంగణం గంతుం హరిధాత్రో రధీశ్వరః।
ఆజ్ఞాపయ ద్గణేశానాం శతం తత్రైవ సంసది॥ ర

అంత బరమేశ్వరుడు గణనాయకశతమున కాసభయందే విరించిమాధవుల యుద్ధరంగమున కేగుటకై యాజ్ఞాపించెను.

తతో వాద్యం బహువిధం ప్రయాణాయ పరేశితుః।
గణేశ్వరాశ్చ సంనద్ధా నానావాహన భూషణాః॥ ౫

అప్పుడు పరమేశ్వరుని ప్రయాణమునకై నానావిధ వాద్యములు, నానావాహనాలంకార భూషితులగు గణనాయకులును సంసిద్ధులైరి.

ప్రణవాకార మాద్యం తం పంచమండలనిర్మితం।
ఆరురోహ రథం భద్ర మంబికాపతి రీశ్వరః॥ ౬

ససూను గణమింద్రాద్యా స్సర్వే ప్యనుయయు స్సురాః।

పార్వతీపతియగు శంకరుడు పంచమండల నిర్మితమై యోంకారాకృతిని శుభకరమై యొప్పు రథము నధిరోహిం

చెను. ఇంద్రాదిదేవతలును సపుత్రకుండును, సానుచరుండు నగు నా శంకరు ననుగమించిరి.

చిత్రధ్వజ వ్యజనచామరపుష్పవర్ష
సంగీతనృత్యనివహై రపి వాద్యవర్గైః।
సంమానితః పశుపతిః పరయా చ దేవ్యా
సాకం తయో స్సమరభూమి మగా త్ససైన్యః॥ ౭

చిత్రధ్వజములు, చామర వీజనంబులు, నృత్త గీత వాద్యంబులు మున్నగువానిచే నధిక వైభవోపేతుడై పశుపతి యగు శంకరుడు భగవతిపార్వతితో, సైన్యముతో నా బ్రహ్మ విష్ణువుల రణరంగమునుగూర్చి యరిగెను.

సమీక్ష్యతు తయో ర్యుద్ధం నిగూఢో ఽభ్రం సమాస్థితః।
సమాప్తవాద్యనిర్ఘోషః శాంతో రుగణనిస్స్వనః॥ ౮

వారి యుద్ధము నవలోకించి శివుడు గణవాద్యముల కోలాహలము నుజ్జగించి, యతినిగూఢముగ గగనమునందవస్థితుడై యుండెను.

అథ బ్రహ్మాచ్యుతౌ వీరౌ హంతుకామౌ పరస్పరమ్।
మాహేశ్వరేణ చాస్త్రేణ తథా పాశుపతేన చ॥ ౯

అస్త్రజ్వాలై రథో దగ్ధం బ్రహ్మవిష్ణ్వో ర్జగత్త్రయమ్।
ఈశో ఽపి తం నిరీక్ష్యాథ హ్యకాలప్రలయం భృశమ్॥

మహానలస్తంభ బిభీషణాకృతి
ర్బభూవ తన్మధ్యతలే సనిష్కలః॥ ౧౧

అంత బ్రహ్మవిష్ణువులు, మాహేశ్వరాస్త్ర పాశుపతాస్త్రములచే నొకరి నొకరు చంప నెంచుటయు, బ్రహ్మవిష్ణు ప్రయుక్తంబులగు నా యస్త్రజ్వాలలచే ముల్లోకములు దగ్ధమగుచుండుటయు, మిక్కుటముగ నకాలప్రళయమగుటయు గాంచి, నిష్కలుండగు పరమేశ్వరుడు భీషణమైన మహాగ్ని స్తంభరూపమున నా బ్రహ్మవిష్ణువుల మధ్యస్థలమునం దావిర్భవించెను,

తే అస్త్రే చాపి సజ్వాలే లోకసంహరణక్షమే ।
నిపేతతుః క్షణేనైవ, హ్యావిర్భూతే మహానలే॥ ౧౨

జ్వాలాసహితములై లోకసంహారసమర్థములైన యా యస్త్రములు క్షణకాలమున బ్రాదుర్భవించిన మహానలమందు నిపతితములయ్యెను.

దృష్ట్వా తదద్భుతం చిత్ర మస్త్రశాంతికరం శుభమ్ ।
కి మేత దద్భుతాకార మిత్యూచుశ్చ పరస్పరమ్॥ ౧౩

విచిత్రముగ నస్త్రములను శాంతింపజేసి శుభదాయకమైయుండు నాయద్భుతమును గాంచి, వారందఱు 'నిది యేమి యద్భుతాకార' మని యన్యోన్యము పలుకదొడగిరి.

అతీంద్రియ మిదం స్తంభ మగ్నిరూపం కిముత్థితమ్ ।
అస్యోర్ధ్వమపి చా ధశ్చ ఆవయో ర్లక్ష్యమేవహి॥ ౧౪
ఇతి వ్యవస్థితౌ వీరౌ మిలితౌ వీరమానినౌ ।
తత్పరౌ తత్పరీక్షార్థం ప్రతస్థాతేఽథ సత్వరమ్॥ ౧౫

అంత వీరాభిమానులగు నా బ్రహ్మవిష్ణువులు "అతీంద్రియమగు నీ యగ్నిస్తంభ మెట్లుద్భవించెను? దీని యాద్యం

తములను మనము కనుగొనవలెను." అని యిరువురు నిశ్చయించుకొని, తదాసక్తులై, తత్పరీక్షణమునకు సత్వరముగ నుద్యుక్తులైరి.

ఆవయో ర్మిశ్రయో స్తత్ర కార్యమేకం నసంభవేత్।
ఇత్యుక్త్వా సూకరతను ర్విష్ణు స్తస్యాదిమీయివాన్॥ ౧౬
తథా బ్రహ్మా హంసతను స్తదంతం వీక్షితుం యయౌ।
భిత్త్వా పాతాలనిలయం గత్వా దూరతరం హరిః॥ ౧౭
నాపశ్య త్తస్య సంస్థానం స్తంభస్యానలవర్చసః
శ్రాంత స్స సూకరహరిః పూర్వం ప్రాపరణాంగణమ్॥ ౧౮

అప్పుడు విష్ణువు మనకిరువురకు నొకే కార్యము లెస్స కాదని పల్కి వరాహశరీరియై యాస్తంభమూలమునకు బోవ దొడగెను. అట్లే బ్రహ్మయు హంసశరీరియై దానియంతమును గనుగొన నేగెను.

విష్ణువు పాతాళతలమును భేదించుకొని బహుదూరమేగియు ననలదీప్తమగు నాస్తంభముయొక్క మూలమును గనుగొనజాలకపోయెను. వరాహశరీరియగు విష్ణువు పరిశ్రాంతుడై పూర్వపు రణరంగమునకు జనుదెంచెను.

అథ గచ్ఛంస్తు వ్యోమ్నా చ విధిస్తాతపితాతవ।
దదర్శ కేతకీ పుష్పం కించి ద్విచ్యుత మద్భుతమ్॥ ౨౦
అతిసౌరభ్య మమ్లానం బహువర్ష చ్యుతం తథా।

హేవత్స! నీతండ్రియగు బ్రహ్మ యాకసమున నేగుచు, కించిద్వికసితమై, యద్భుతమై మిక్కిలి పరిమళముకలిగి బహు

వర్ష చ్యుతమయ్యు వాడకయున్న కేతకీకుసుమము (మొగలి పువ్వును) గాంచెను.

అన్వేష్యతు తయోః కృత్యం భగవాన్పరమేశ్వరః॥ ౨౦
పరిహాసం తు కృతవా న్కంపనా చ్చలితం శిరః।
తస్మా త్తావనుగృహ్ణాతు చ్యుతం కేతక ముత్తమమ్॥ ౨౧

భగవంతుడగు శంకరుడు బ్రహ్మవిష్ణువుల ప్రయత్నమును జూచి పరిహాసింపగా దత్కంపనమున శిరస్సు చలించెను. అందుండి యుత్తమమగు కేతకీకుసుమము వారి ననుగ్రహించుటకో యన్నట్లు నిపతితమయ్యెను.

కిం త్వం పతసి పుష్పేశ! పుష్పరాట్ కేనవధృతః।
ఆది మస్యాప్రమేయస్య స్తంభమధ్యా చ్చ్యుత శ్చిరమ్॥ ౨౨
న సంపశ్యామి తస్మా త్త్వం జహ్యాశా మంతదర్శనే,

అప్పుడు బ్రహ్మ యోపుష్పరాజమా! 'ఎవనిచే ధరింపబడి నీవిట్లు పడుచుంటివి?' అని యడుగగా కేతకమిట్లనెను— 'నే నీస్తంభమధ్యమునుండి చిరకాలమునుండి పడుచుండియు నప్రమేయమగు దీని మూలమును గనుగొనజాలకున్నాను. అందుచే నీవు దీనియగ్రమును దర్శించుటయందలి యాశను వీడుము.'

అస్యాం తస్య చ సేవార్థం హంసమూర్తి రిహాగతః॥ ౨౩
ఇతః పరం సఖే మేఽద్య త్వయా కర్తవ్య మీప్సితమ్।
మయాసహ త్వయా వాచ్య మేతద్విష్ణో శ్చ సంనిధౌ॥ ౨౪

స్తంభాంతో వీక్షితో ధాత్రా తత్ర సాక్ష్యహ మచ్యుత।
ఇత్యుక్త్వా కేతకం తత్ర ప్రణనామ పునఃపున॥ ౨౫

అసత్యమపి శస్తంస్యా దాపదీత్యనుశాసనమ్।

అంత బ్రహ్మ నేనిందు హంసశరీరినై దానిని సేవించుటకే వచ్చితిని. మిత్రమా! నీవిప్పుడు నాయభీష్టమును నెరవేర్పవలెను. విష్ణుసన్నిధిని నాతో నీవును "ఓ యచ్యుతా! బ్రహ్మ స్తంభాగ్రమును దర్శించెననుటయందు నేను సాక్షిని" అని పలుకవలెను. ఇట్లని బ్రహ్మ యా కేతకమునకు బునః పునః ప్రణామము లాచరించెను.

సమీక్ష్య తత్రాచ్యుత మాయతశ్రమం
ప్రనష్ట హర్షం తు నన ర్త హర్షాత్।
ఉవాచ చైనం పరమార్థ మచ్యుతం
పండాత్తవాద స్సవిధి స్తతోఽచ్యుతమ్॥ ౨౬

అచ్చట నిరానందుడును, పరిశ్రాంతుడు నగు విష్ణువు నవలోకించి, బ్రహ్మ సంతోషముతో నృత్యము చేయుచు, పాషండవాదము నవలంబించి అచ్యుతుంగూర్చి యిట్లుపలికెను.

స్తంభాగ్ర మేత త్సముదీక్షితం హరే!
తత్రైవ సాక్షీ నను కేతకం త్విదమ్।
తతోఽవద త్తత్ర హి కేతకం మృషా
తథేతి తద్ధాతృవచ స్తదంతికే॥ ౨౭

"హేవిష్ణూ! నే నీ స్తంభాగ్రమును దర్శించితిని. ఈ కేతకీకుసుమ మందులకుసాక్షి." అంత కేతకము విష్ణుసన్నిధిని "విధాత చెప్పినది సత్యమే" యని యసత్యమాడెను.

హరిశ్చ త త్సత్య మితీవ చింతయన్
చకార తస్మై విధయే నమః స్వయమ్।
షోడశై ఉపచారైశ్చ పూజయామాస తం విధిమ్॥ ౨౯

విష్ణువది సత్యమేయని చింతించి, తాను విధాతకు నమస్కరించి, షోడశోపచారములతో నాతని బూజించెను.

విధిం ప్రహర్తుం శర మగ్నిలింగతః।
స ఈశ్వర స్తత్ర బభూవ సాకృతిః॥
సముత్థిత స్వామివిలోకనా త్పునః।
ప్రకంపపాణిః పరిగృహ్య త త్పదమ్॥ ౩౦

ఆద్యంతహీనవపుషి త్వయి మోహబుద్ధ్యా।
భూయా న్విమర్శ ఇహ నావతి కామనోత్థః॥
సత్వం ప్రసీద కరుణాకర! కశ్మలంనో।
మృష్టం క్షమస్వ విహితం భవతైవ కేల్యా॥ ౩౧

అంత నీశ్వరుడు వంచకుడగు విధాతను బ్రహరించుటకై యగ్నిలింగమునుండి దివ్యాకృతి నావిర్భవించెను. అంత విష్ణువు పరమేశ్వర సందర్శనమున మరల నుత్థితుడై వణుకుచున్న చేతులతో నాతని పాదముల బట్టికొని, "ఆద్యంతములు లేని శరీరముగల నీయందజ్ఞానవశమున, నహంకారసంజనితమగు నిట్టి విమర్శ మాకేర్పడెను. కావున నో కృపాళూ! నీవు మాయెడల బ్రసన్నుడవగుము. మా పాపములు నీదర్శనమున వినష్టములైనవి. సర్వమును నీ లీలాచోదితమే.

ఈశ్వర ఉవాచ:—

వత్స! ప్రసన్నోఽస్మి హరే యత స్త్వం।

ఈశత్వ మిచ్ఛన్నపి సత్యవాక్యమ్॥
బ్రూయా స్తత స్తే భవితాజనేషు।
సామ్యం మయా సత్కృతి రప్యలప్సి॥ 32

ఈశ్వరు డిట్లనెను. హేవత్స! విష్ణూ! నీవు ప్రాభవ మును గోరుచుండియు, సత్యమునే పలికినందున నేను ప్రస న్నుడ నైతిని. అందువలన నీవు జనులయందు నాతో సమాన త్వముగ సత్కారమును బొందగలవు. ఇంతటినుండి పుణ్య క్షేత్రములందు ప్రత్యేకముగ నీకు ప్రతిష్ఠ, ఉత్సవములు, పూజలు ప్రవర్తిల్లును.

ఇతి దేవః పురా ప్రీతః స్సత్యేన హరయే పరమ్।
దదౌ స్వసామ్యమత్యర్థం దేవసంఘే చ పశ్యతి॥ 33

ఇతి శ్రీ శివమహాపురాణే విద్యేశ్వరసంహితాయాం
సప్తమోఽధ్యాయః॥

ఇట్లని ప్రసన్నుడైన మహాదేవుడు దేవతలందఱు చూచుచుండగా సత్యము కారణముగా విష్ణువునకు దనతో నధికమగు సమానత్వము ననుగ్రహించెను.

ఇది శ్రీ శివమహాపురాణమున విద్యేశ్వరసంహితయందు
ఏడవ యధ్యాయము.



## అష్టమోఽధ్యాయః

నందికేశ్వర ఉవాచ:—

ససర్జాథ మహాదేవః పురుషం కంచి దద్భుతమ్।
భైరవాఖ్యం భ్రువోర్మధ్యాత్ బ్రహ్మదర్పజిఘాంసయా॥ ౧

నందికేశ్వరు డిట్లుచెప్పెను. అనంతరము మహాదేవుడు విధాతగర్వము నణచుటకై భ్రూమధ్యమునుండి భైరవుడను నొక యద్భుతపురుషుని సృజించెను.

సవై తదా తత్ర పతిం ప్రణమ్య శివమంగణే।
కిం కార్యం కరవాణ్యత్ర శీఘ్ర మాజ్ఞాపయ ప్రభో! ౨

అప్పుడాతడు ప్రభువగు శివునకు నమస్కరించి, హే ప్రభో! నేనేమి చేయవలయునో యాజ్ఞాపింపుమనెను.

వత్స! యోఽయం విధి స్సాక్షా జ్జగతా మాద్యదైవతమ్।
నూన మర్చయ ఖడ్గేన తిగ్మేన జవసా పరమ్॥ 3

శివుడంతట హేవత్స! లోకములకు సాక్షాదాదిదైవమగు నీవిధాతను నీవు శీఘ్రముగా వాడియైన కత్తిచే జక్కగా బూజింపుము అనెను.

సవై గృహీత్వైక కరేణ కేశం
తత్పంచమం దృప్త మసత్యభాషణమ్।
ఛిత్వా శిరాంస్యస్య నిహంతు ముద్యతః
ప్రకంపయ న్ఖడ్గ మతిస్ఫుటం కరైః॥ ౪

అతడును నొకచేత జుట్టుపట్టుకొని గర్వించి యసత్యము బలికిన బ్రహ్మయొక్క పంచమశీర్షమును ఖండించి, యుగ్ర

కరవాలమును ఝుళిపించుచు నితరమస్తకములగూడ ఖండించుట కుద్యుక్తుడయ్యెను.

పితా త్వవోత్సృష్ట విభూషణాంబర
స్రగుత్తరీయా మలకేశ సంహతిః।
ప్రవాతరంభేవ లతేవ చంచలః
పపాత తద్భైరవ పాదపంకజే॥ ౫

అప్పుడు నీ తండ్రి* వస్త్రములు, ఆభరణములు, మాల్యము, ఉత్తరీయము సుందరమైన కేశకలాపము విక్షిప్తమగుచుండ ప్రచండ వాయుకంపితమగు కదళీతరువువోలె, లతవలె గంపించుచు నాభైరవుని పాదపద్మములపై బడెను.

తావ ద్విధిం తాత! దిదృక్షు రచ్యుతః
కృపాలు రస్మత్పతిపాదపల్లవమ్।
నిషిచ్య బాష్పై రవద త్కృతాంజలిః
యథా శిశుః స్వం పితరం కలాతురమ్॥ ౬

ఓ సనత్కుమారా! అంత విష్ణువు బ్రహ్మనుజూచి, దయగలవాడై నాయొక్క ప్రభువగు మహాదేవుని పాదపల్లవములను గన్నీటిచే దడుపుచు కృతాంజలిపుటుడై కుమారుడు తండ్రినివలె నవ్యక్తమధురస్వరమున నిట్లు ప్రార్థించెను.

అచ్యుత ఉవాచ:—

త్వయా ప్రయత్నేన పురాహి దత్తం
యదస్య పంచానన మీశచిహ్నమ్।

* సనత్కుమారుని తండ్రియగు బ్రహ్మ.

తస్మాత్ క్షమస్వాద్య మనుగ్రహార్హాం
కురు ప్రసాదం విధయే హ్యాముష్మై॥ ౭

అచ్యుతు డిట్లనెను. హేప్రభో! నీవే పూర్వమీతని కీశ్వరలక్షణమగు పంచముఖత్వము ననుగ్రహించితివి. అందుచే నీ విబ్రహ్మను క్షమింప దగినవారిలో మొదటివానిగా దలంచి యనుగ్రహము జూపుము.

ఇత్యర్థితో౽చ్యుతేనేశః తుష్టః సురగణాంగణే।
నివర్తయామాస తదా భైరవం బ్రహ్మదండతః॥ ౮

ఇట్లు విష్ణువుచే బ్రార్థింపబడి, సతుష్టుడై మహాదేవుడు దేవతలందరియెదుట "బ్రహ్మను దండింపవలదని" భైరవుని వారించెను

అథాహ దేవః కితవం విధిం విగతకంధరమ్।
బ్రహ్మన్ త్వమర్హణాకాంక్షీ శఠేశత్వం సమాస్థితః॥ ౯
నాత స్తే సత్కృతిర్లోకే భూయా త్థాననో త్సవాదికమ్।

అంత మహాదేవుండు వంచకుడు, ఛిన్నమస్తకుడు నగు బ్రహ్మనుగూర్చి యిట్లనెను. ఓ బ్రహ్మ! నీవు పూజ్యతను గాంక్షించి, పరమవంచకుడ వైతివి. అందువలన నీ కింతటి నుండి లోకమున క్షేత్రోత్సవములు లేకుండు గాక!

బ్రహ్మోవాచ:—

స్వామి ప్రసీదాద్య మహావిభూతే
మన్యే వరం మే శిరసః ప్రమోక్షమ్॥ ౧౦

నమస్తుభ్యం భగవతే బంధవే విశ్వయోనయే।
సహిష్ణవే చ దోషాణాం శంభవే శైలధన్వనే॥ ౧౧

బ్రహ్మ యిట్లనెను. మహైశ్వర్య సంపన్నుడవగు నో ప్రభూ! అనుగ్రహింపుము. ఇప్పుడు నేను మస్తకఖండనము నే వరముగ భావించుచున్నాను. ఓ జగద్బంధూ! విశ్వమునకు గారణరూపుడవై ఎల్లరదోషములను క్షమించుచు, మేరు పర్వతము ధనుస్సుగా విలసిల్లెడి యో దేవా! నీకు నమస్కారము.

ఈశ్వర ఉవాచ:—

అరాజభయమేతద్వై జగత్సర్వం నశిష్యతి।
తతస్త్వం జహి దండార్హం వహాలోకధురం శిశో॥ ౧౨

ఈశ్వరు డిట్లనెను. హే వత్స! రాజదండభయము లేకున్న నీజగమంతయు నశించును. అందుచే నీవు "నేను దండింపబడితి నను విచారమును" వీడి లోకభారమును వహింపుము.

వరం దదామి తే తత్ర గృహాణ దుర్లభం పరమ్।
వైతానికేషు గుహ్యేషు, యజ్ఞేషు చ భవాన్గురుః॥ ౧౩
నిష్ఫలస్త్వాదృతే యజ్ఞ స్సాంగశ్చ సహదక్షిణః।

నీకు నేను దుర్లభమును, నుత్కృష్టము నగు వరము నొసంగుచుంటిని. నీ వింతటినుండి యజ్ఞములందు, గుహ్యా వైతానిక సూక్తములందు, గురుడవై] విలసిల్లుదువు. నీవు లేని యజ్ఞములు సర్వాంగపూర్ణములై, దక్షిణాసహితములైనను నిష్ఫలము లగును.

అథాహ దేవః కితవం కేతకం కూటసాక్షిణమ్॥ ౧౪
రేరే కేతక! దుష్ట స్త్వం శఠ! దూరమితో వ్రజ।
మమాపి ప్రేమ తేపుష్పే మాభూ త్పూజాస్వితః పరమ్॥ ౧౫

అంత నామహాదేవుడు కూటసాక్ష్యము నొసంగి వంచక మైన కేతకమునుగూర్చి యిట్లనెను. ఓ కేతకమా! నీవుదుష్టుడవు. వంచకుడవు. ఇచ్చటినుండి దూరముగ పొమ్ము. ఇంతటనుండి నాకుగూడ పూజాదికమున నీయెడ ప్రేమకలుగ కుండుగాక!

ఇత్యుక్తే తత్ర దేవేన కేతకం దేవజాతయః।
సర్వానివారయామాసు స్తత్పార్శ్వాదన్యత స్తదా॥ ౧౬

మహాదేవు డిట్లు శపింపగనే దేవతలందరు శివసన్నిధి నుండి యాకుసుమమును దొలగద్రోసిరి.

కేతక ఉవాచ:—

నమస్తే నాథ! మే జన్మ నిష్ఫలం భవ దాజ్ఞయా।
సఫలం క్రియతాం తాత! క్షమ్యతాం మమ కిల్బిషమ్॥౧౭

జ్ఞానాజ్ఞానకృతం పాపం నాశయత్యేవ తే స్మృతిః।
తాదృశే త్వయి దృష్టే మే మిథ్యాదోషః కుతో భవేత్॥

కేతక మిట్లనెను. హేప్రభో! నమస్కారము. నీయాజ్ఞ వలన నాజన్మ నిష్ఫలమయ్యెను. ఓతండ్రీ! నీవు నాదోషమును క్షమించి, నాజన్మను సఫలము గావింపుము. నిన్ను స్మరించుటచేతనే తెలిసియు, తెలియకయు జేసిన పాపములు నశించుచుండ, నిన్నే దర్శించిన నాకు అసత్యదోష మెట్లు సంభవించును?

తథా స్తుతస్తు భగవాన్ కేతకేన సభాతలే।
న మే త్వద్ధారణం యోగ్యం సత్యవా గహ మీశ్వరః॥౧౯

మదీయా స్త్వాం ధరిష్యంతి జన్మ తే సఫలం తతః।
త్వం వై వితాన వ్యాజేన మమోపరి భవిష్యసి॥ ౨౦

కేతకముచే శంకరుడందజేయెదుట నావిధముగ స్తుతింపబడి యిట్లనెను. ఓ కేతకమా! నేను సత్యవాజ్నియమముగల జగదీశ్వరుడను. నిన్ను ధరించుట నాకు యోగ్యముకాదు. నావారలగు విష్ణువు మున్నగువారు నిన్ను ధరింతురు. ఇట్లు నీజన్మసఫలమగును. నీవు నాకుపరిభాగమున వితానమువలె నుందువు.

ఇత్యనుగృహ్యాభగవా న్కేతకం విధిమాధవౌ।
విరరాజ సభామధ్యే సర్వదేవై రభిష్టుతః॥ ౨౧

ఇతి శ్రీశివమహాపురాణే విద్యేశ్వరసంహితాయాం
అష్టమోఽధ్యాయః॥

ఇట్లు పరమేశ్వరుడు బ్రహ్మవిష్ణువులను, కేతకమును అనుగ్రహించి దేవతలెల్లరు స్తుతింపగా సభామధ్యమున విరాజిల్లుచుండెను.

ఇది శ్రీశివమహాపురాణమున విద్యేశ్వరసంహితయందు
ఎనిమిదవ అధ్యాయము.

—*—

## నవమోఽధ్యాయః

నందికేశ్వర ఉవాచ:—

తత్రాంతరే తౌ చ నాథం ప్రణమ్య విధిమాధవౌ।
బద్ధాంజలిపుటే తూష్ణీం తస్థతు ర్దక్షవామగౌ॥ ౧

అంతలో బ్రహ్మవిష్ణువులు పరమేశునకు నమస్కరించి కృతాంజలిపుటులై కుడియెడమల నిలచియుండిరి.

తత్ర సంస్థాప్య తౌ దేవం సకుటుంబం వరాసనే।
పూజయామాసతుః పూజ్యం పుణ్యైః పురుషవస్తుభిః॥ ౨
పౌరుషం ప్రాకృతం వస్తు జ్ఞేయదీర్ఘాల్పకాలికమ్।

అచ్చట వారు అల్పదీర్ఘకాలికములగు ప్రకృతి పురుషులరూపముగా తెలియదగిన పూజనీయుడగు దేవదేవుని సపరివారముగ శ్రేష్ఠమగు నాసనమున నాసీనుంజేసి పవిత్రమగు వస్తునిచయముచే బూజించిరి.

హారనూపురకేయూర కిరీటమణికుండలైః॥ 3
యజ్ఞసూత్రోత్తరీయస్రక్ క్షౌమమాల్యాంగులీయకైః
పుష్పతాంబూలకర్పూర చందనాగరులేపనైః॥ ౪
ధూపదీపసితచ్ఛత్ర వ్యజనధ్వజచామరైః।
అన్యైర్దివ్యోపహారైశ్చ వాఙ్మనోతీతవైభవైః॥ ౫
పతియోగ్యైః పశ్వలభ్యైస్తౌ సమర్చయతాం పతిమ్।
యద్యచ్ఛ్రేష్ఠతమం వస్తు పతియోగ్యం హి తద్విజ॥ ౬

అవర్ణనీయము అనూహ్యము నగు వైభవముగల హారములు, నూపురములు, కేయూరములు, కిరీటము, మణికుండలములు, యజ్ఞోపవీతము, ఉత్తరీయము, పుష్పమాలిక, క్షౌమవస్త్రము (పట్టుబట్ట), అంగులీయకము, పుష్పచందన తాంబూలములు, కర్పూరము, అగరు, అనులేపనము, ధూపము, దీపము, శ్వేతచ్ఛత్రము, వ్యజనధ్వజము, చామరము మున్నగు

సామాన్యజన దుర్లభము లగు దివ్యోపహారములచే వారు స్వామియగు శంకరుని బూజించిరి శ్రేష్ఠతమములగు వస్తువు లన్నియు శివపూజార్హములే యని యెఱుంగునది.

తద్వస్త్వఖిలమీశోఽపి పారంపర్యచికీర్షయా।
సభ్యానాం ప్రదదౌహృష్టః పృథక్త్వత్రయథాక్రమమ్॥ ౭
కోలాహలో మహానాసీ త్తత్ర తద్వస్తు గృహ్ణతాం।

పరమేశ్వరు డావస్తువులనన్నిటిని ఆచారము ననుసరించి, అచ్చటగల సభ్యుల కందఱకు క్రమముగా సంతోషముతో బంచియిచ్చెను. అచ్చట నావస్తువులను బరిగ్రహించు వారల కోలాహలము మిక్కుటమయ్యెను.

తత్రైవ బ్రహ్మవిష్ణుభ్యాం చార్చితః శంకరః పురా॥ ౮
ప్రసన్నః ప్రాహతౌ నమ్రౌ సస్మితం భక్తివర్ధనః।

అచ్చట నీవిధముగా బ్రహ్మవిష్ణువులచే బూజింపబడి భక్తివర్ధకుడగు శంకరుడు, వినయవినమితులగు నా బ్రహ్మవిష్ణువులగూర్చి యిట్లనెను.

ఈశ్వర ఉవాచ:—

తుష్టోఽహ మద్యవాంవత్సౌ పూజయాస్మి న్మహాదినే॥ ౯
దిన మేత త్తతః పుణ్యం భవిష్యతి మహ త్తరమ్।
శివరాత్రి రితి ఖ్యాతా తిథి రేషా మమప్రియా॥ ౧౦

ఈశ్వరు డిట్లనెను. ఓవత్సలారా! ఈమహాదివసమున మీరు పూజించుటచే నేను మీయెడ బ్రసన్నుడ నైతిని. అందుచే నీదినము మిక్కిలి పవిత్రమైనది కాగలదు. ఈ తిథి శివరాత్రియనుపేర నాకు బ్రీతిభాజనమై యొప్పును.

ఏతత్కాలేతు యః కుర్యా త్పూజాం మల్లింగబేరయోః।
కుర్యాత్తు జగతః కృత్యం స్థితిసర్గాదికం పుమాన్॥ ౧౧

ఈ సమయమున లింగరూపమున గాని, ప్రతిమా రూపమునగాని నన్ను బూజించు పురుషుడు జగత్సృష్టి స్థితి లయకార్యముల నొనర్చును.

శివరాత్రావహోరాత్రం నిరాహారో జితేంద్రియః।
అర్చయేద్వా యథాన్యాయం యథాబలమవంచకః॥ ౧౨
య త్ఫలం మమపూజాయాం వర్ష మేకం నిరంతరమ్।
త త్ఫలం లభతే సద్య శ్శివరాత్రౌ మదర్చనాత్॥ ౧౩

శివరాత్రినం దహోరాత్రము లుపవసించి, జితేంద్రియుడై వంచనలేక యథాశక్తి యథావిధుల నన్ను బూజించిన వాడు నిరంతర మొక సంవత్సరము నన్నర్చించిన లభించు పుణ్యఫలము నొందగలడు.

మ ద్ధర్మబుద్ధికాలోఽయం చంద్రకాల ఇవాంబుధేః।
ప్రతిష్ఠాద్యుత్సవా యత్ర మామకో మంగలాయనః॥ ౧౪

చంద్రోదయము సముద్రమునువలె నీ సమయము నాధర్మమును (శివధర్మమును) పెంపొందించును. ఈసమయమున నన్ను బ్రతిష్ఠించి నాకై యుత్సవములను జేసిన శుభములు కలుగును.

య త్పునః స్తంభరూపేణ స్వావిరాస మహంపురా।
స కాలో మార్గశీర్షేతు స్యాదార్ద్రా ఋక్షమర్భకౌ॥ ౧౫
ఆర్ద్రాయాం మార్గశీర్షేతు యః పశ్యే న్మా ముమాసఖమ్।
మద్బేర మపి వా లింగం సగుహాదపి మే ప్రియః॥ ౧౬

వత్సలారా! పూర్వము మార్గశీర్షమాసమున ఆర్ద్రా నక్షత్రమున తేజోమయ స్తంభరూపుడనై నే నావిర్భవించితిని. మార్గశీర్షమునం దార్ద్రానక్షత్రయుక్త దివసమున బార్వతీ సహితుడ నగు నన్ను (లింగమునుగాని, ప్రతిమనుగాని) సందర్శించినవాడు నాకు గుమారస్వామికంటె బ్రియుడగును.

అలం దర్శన మాత్రేణ ఫలం తస్మి న్ముభే దినే।
అభ్యర్చనం చేదధికం ఫలం వాచామగోచరమ్॥ ౧౭

ఆనాడు మత్సందర్శనమాత్రమున నధిక పుణ్యఫలము చేకూరును. పూజించినచో నవర్ణనీయమగు ఫలితముకలుగును.

రణరంగతలేఽ ముష్మి న్యదహం లింగవర్ష్మణా।
జృంభితో లింగవ త్తస్మా ల్లింగస్థాన మిదం భవేత్॥ ౧౮

ఈరణరంగమున నేను లింగరూపమున నావిర్భవించితిని. అందుచే నిది లింగస్థాన మనబడును.

అనాద్యంత మిదం స్తంభ మణుమాత్రం భవిష్యతి।
దర్శనార్థం హి జగతాం పూజనార్థం హి పుత్రకౌ॥ ౧౯

ఓవత్సలారా! లోకములు దర్శించి పూజించుటకై ఆద్యంతములులేని యీ తేజోమయలింగము అల్పమగు నాకారముగలది యగును.

భోగావహ మిదం లింగం భుక్తిముక్త్యైక సాధనమ్।
దర్శనస్పర్శనధ్యానా జ్జంతూనాం జన్మమోచనమ్॥ ౨౦

సమస్తభోగములను గలుగజేయుచు నీ శివలింగము భుక్తిని, ముక్తిని గూడ గలుగజేయునదగును. ఈలింగము

యొక్క దర్శనము, స్పర్శనము, ధ్యానము జీవులను బునర్జన్మ రహితుల గావించును.

అనలాచలసంకాశం యదిదం లింగ ముత్థితమ్।
అరుణాచల మిత్యేవ తదిదం ఖ్యాతి మేష్యతి॥ ౨౧

అగ్నిపర్వతమువలె నీ లింగము ప్రాదుర్భవించుటచే నియ్యది "అరుణాచల" మను పేర బ్రసిద్ధినొందును.

అత్ర తీర్థం చ బహుధా భవిష్యతి మహత్తరమ్।
ముక్తిరస్యత్ర జంతూనాం వాసేన మరణేన చ॥ ౨౨

ఇచ్చట మహత్తరమగు సర్వతీర్థములు వసించును. ఈక్షేత్రమున నివసించినను మరణించినను జనులు ముక్తి నొందుదురు.

రథోత్సవాది కల్యాణం జనావాసం తు సర్వతః।
అత్ర దత్తం హుతం జప్తం సర్వం కోటిగుణం భవేత్॥ ౨౩

ఈక్షేత్రము జనావాసమై రథోత్సవాది కల్యాణశోభిత మగును. ఇచ్చట చేసిన దానహోమజపము లన్నియు కోటి గుణితము లగును.

మత్క్షేత్రా దపి సర్వస్మా త్క్షేత్ర మేత న్మహత్తరమ్।
అత్ర సంస్మృతి మాత్రేణ ముక్తి ర్భవతి దేహినామ్॥ ౨౪

తస్మా న్మహత్తర మిదం క్షేత్ర మత్యంతశోభనమ్।

నా క్షేత్రములన్నిటిలో నీక్షేత్ర ముత్కృష్టతమమైన దగును. ఇచ్చట నన్ను స్మరించినంతనే జీవులు ముక్తినొందు దురు, అందుచే మహత్తరమై సర్వకల్యాణకరమై, చతుర్విధ

ముక్తిప్రదమై, శుభకరమై విలసిల్లు నీక్షేత్రము సర్వోత్తమమైనది.

సర్వకల్యాణ సంపూర్ణం సర్వముక్తికరం శుభమ్॥ ౨౫
అర్చయిత్వాత్ర మామేవ లింగే లింగిన మీశ్వరమ్।
సాలోక్యం చైవ సామీప్యం సాయుజ్యం సార్ష్టి రేవ చ॥
సాయుజ్య మితిపంచైతే క్రియాదీనాం ఫలం మతమ్।
సర్వేఽపి యూయం సకలం ప్రాప్స్యథాశు మనోరథమ్॥

ఇచ్చట లింగస్వరూపుడనగు నన్ను బూజించినవారికి సాలోక్య, సారూప్య, సాయుజ్య, సామీప్య, సార్ష్టులను ముక్తులైదును బూజాఫలితముగా లభించును. మీరందఱు నతిశీఘ్రముగా మనోరథ సిద్ధినొందుదురు.

నందికేశ్వర ఉవాచ:—

ఇత్యనుగృహ్య భగవాన్ వినీతౌవిధిమాధవౌ।
యత్పూర్వం ప్రహతం యుద్ధే తయో సైన్యం పరస్పరమ్॥
తదుత్థాపయ దత్యర్థం స్వశక్త్యామృతధారయా।
తయో ర్మౌఢ్యం చ వైరం చ వ్యపనేతు మువాచతౌ॥ ౨౬

నందికేశ్వరు డిట్లనెను ఈ విధముగ పరమేశ్వరుడు వినయవినమితులగు విరించిమాధవుల ననుగ్రహించి, యుద్ధమున మడిసిన వారలసైన్యమును నిజప్రభావంబున నమృతధారచే పునరుజ్జీవితము గావించి వారల మూర్ఖత్వమును, శత్రుత్వమును దొలగించుటకై వారితో నిట్లనెను.

సకలం నిష్కలం చేతి స్వరూపద్వయ మస్తి మే।
నాన్యస్య కస్య చిత్తస్మా దన్య స్సర్వోఽ ప్యనీశ్వరః॥ ౩౦

నాకు సగుణనిర్గుణములను రెం॰॰ రూపములుకలవు. ఇతరుల కేరికి నీరూపములు లేవు. అందువలన నితరు డెవ్వ॰ నీశ్వరుడు కాడు.

పురస్తా త్స్తంభరూపేణ పశ్చా ద్రూపేణ చా ర్భకౌ।
బ్రహ్మత్వం నిష్కలం ప్రోక్త మీశత్వం సకలం తథా॥ ౩౧
ద్వయం మమైవ సంసిద్ధ న మదన్యస్య కస్య చిత్।
తస్మా దీశత్వ మన్యేషాం యువయో రపి న క్వచిత్॥ ౩౨

ఓవత్సలారా! నేను మొదట నిర్గుణ స్తం భరూపమున, పిదప సగుణస్వరూపమునను ఆవిర్భవించితిని. అందుచే నిర్గుణ బ్రహ్మతత్త్వము, సగుణేశ్వరత్వము నను రెండును నాకేకలవు కాని యితరుల కేరికిని లేవు. ఇతరులకే కాదు. మీకును ఈశ్వరత్వము లేదు.

త దజ్ఞానేన వాం వృత్త మీశమానం మహాద్భుతమ్।
త న్నిరాకర్తు మత్రైవ ముత్థితోఽహం రణక్షితౌ॥ ౩౩

అందుచే నజ్ఞానజనితమును, గొప్పదియు నగు మీ యొక్క ఈశ్వరాభిమానమును దొలగించుటకై నేనీరణరంగమునం దావిర్భవించితిని.

త్యజ తం మాన మాత్మీయం మయీశే కురు తం మతిం।
మత్ప్రసాదేన లోకేషు సర్వోఽప్యర్థః ప్రకాశతే॥ ౩౪
గురూక్తి ర్వ్యంజకం తత్ర ప్రమాణం వా పునఃపునః।
బ్రహ్మతత్త్వ మిదం గూఢం భవత్ప్రీత్యా భణామ్యహమ్॥

ఆత్మీయేశ్వరాభిమానమును వీడి ఈశ్వరుడనగు నాయందే అట్టి ఈశత్వబుద్ధి కలిగియుండుడు. నా యనుగ్రహముచే లోకమునందెల్ల కార్యములు సిద్ధించుచున్నవి. దీనిని (గురువచనమే) ప్రకటించునది లేక పునఃపునః ప్రమాణమునై యున్నది. నిగూఢమగు నీ బ్రహ్మతత్త్వమును మీయందలి ప్రేమచే జెప్పుచుంటిని.

అహమేవ పరం బ్రహ్మ మత్స్వరూపం కలాకలమ్।
బ్రహ్మత్వా దీశ్వరశ్చాహం కృత్యం మేఽనుగ్రహాదికమ్॥

నేనే పరబ్రహ్మను. సగుణనిర్గుణములు నాస్వరూపములే. బ్రహ్మత్వమువలన నే నీశ్వరుడను గూడనైతిని. అనుగ్రహాదికములు నాకార్యములు.

బృహత్త్వా ద్బృంహణత్వా చ్చ బ్రహ్మాహం బ్రహ్మకేశవౌ।
సమత్వా ద్వ్యాపకత్వా చ్చ తథైవాత్మాహ మర్భకౌ॥ ३८

ఓ విరించిమాధవులారా! బృహత్త్వ బృంహణత్వముల వలన నేనే బ్రహ్మను. ఓవత్సలారా! సమానుడనై వ్యాపకుడనై యుంటచే నేనే పరమాత్మను.

అనాత్మనః పరే సర్వే జీవా ఏవ న సంశయః।
అనుగ్రహాద్యం సర్గాంతం జగత్కృత్యం చ పంచకమ్॥ ३७

ఈశత్వా దేవ మే నిత్యం నమదన్యస్య కస్యచిత్।
ఆదౌ బ్రహ్మత్వ బుద్ధ్యర్థం నిష్కలం లింగ ముత్థితమ్॥ ३८

తస్మా దజ్ఞాత మీశత్వం వ్యక్తం ద్యోతయితుం హి వామ్।
సకలోఽహ మతో జాత స్సాక్షా దీశస్తు తత్క్షణాత్॥ ४०

ఇతరు లెల్లరు జీవులే యనుటయందు సందేహము లేదు. అనుగ్రహము మున్నగాగల సర్గాంతములగు పంచ జగత్కృత్యములు నీశ్వరుండ నగుటచే నాకు నిత్యసిద్ధములు. ఈకార్యము లితరులకు సాధ్యములు కావు. మొదట నిర్గుణ బ్రహ్మబుద్ధిని జనింపజేయుట కీ శివలింగ ముద్భవించెను. మీరలెఱుంగని ఈశ్వరత్వమును మీకు స్పష్టముగా దెలియ జేయుటకై దానినుండి నేను సగుణమగు నీశ్వరరూపమున నావిర్భవించితిని.

సకలత్వా మతో జ్ఞేయ మీశత్వం మయి సత్వరమ్।
య దిదం నిష్కలం స్తంభం మమ బ్రహ్మత్వబోధకమ్॥
లింగలక్షణయుక్తత్వా న్మమలింగం భవే దిదమ్।
త దిదం నిత్య మభ్యర్చ్యం యువాభ్యా మత్ర పుత్రకౌ॥ ४२

అందుచే నేను సగుణుడ నగు నీశ్వరుడ నని తెలియ వలెను. ఈ నిర్గుణ స్తంభము నాయొక్క పరబ్రహ్మత్వమును సూచించును. ఇది లింగచిహ్నములు గలదగుటచే నాకు లింగమై (గురుతు) యుండగలదు. ఓవత్సలారా! ఆ యీశివ లింగము మీకు నిత్యము పూజింపదగినది.

మదాత్మక మిదం నిత్యం మమసాన్నిధ్యకారణమ్।
మహత్పూజ్య మిదం నిత్య మభేదాల్లింగ లింగినోః॥ ४३

ఈలింగము నాస్వరూపమైయుండ నాయొక్క నిత్య సన్నిధికి హేతువు కాగలదు. లింగలింగులకు (గురుతుకు గురుతు గలవానికి) భేదము లేనందున నీ లింగము మీకు మిగుల బూజ నీయమై యున్నది.

యత్ర ప్రతిష్ఠితం యేన మదీయం లింగ మీదృశమ్।
తత్ర ప్రతిష్ఠిత స్సోఽహ మప్రతిష్ఠోఽపి వత్సకాః॥ ౪౪

ఓవత్సలారా! ఇట్టిలింగము నెవరెచ్చట ప్రతిష్ఠించి నను, నేనచ్చట బ్రతిష్ఠితుడను గాకున్నను ప్రతిష్ఠితుడనే. (నిర్గుణలింగప్రతిష్ఠ సగుణుడగు నీశ్వరుని బ్రతిష్ఠించుటయే యని భావము.)

మ త్సామ్య మేకలింగస్య స్థాపనే ఫల మీరితమ్।
ద్వితీయే స్థాపితే లింగే మదైక్యం ఫల మేవ హి॥ ౪౫

ఒక శివలింగమును బ్రతిష్ఠించుటచే నాతోసమానత్వ మును, రెండవశివలింగమునుగూడ ప్రతిష్ఠించుటచే నాలో నైక్యమగుటయును ఫలితములగును.

లింగం ప్రాధాన్యతః స్థాప్యం తథా బేరం తు గౌణకమ్।
లింగాభావేన తత్క్షేత్రం సబేర మపి సర్వతః॥ ౪౬

ఇతి శ్రీశివమహాపురాణే విద్యేశ్వరసంహితాయాం
నవమోఽధ్యాయః

శివలింగప్రతిష్ఠ ప్రధానమైనది. విగ్రహప్రతిష్ఠ అప్ర ధానము. శివలింగమున్నక్షేత్రము సర్వధా శివప్రతిమా యుక్తముకూడ నగును.

ఇది శ్రీశివమహాపురాణమున విద్యేశ్వరసంహితయందు
తొమ్మిదవ యధ్యాయము.

—*—

## దశమోఽధ్యాయః

బ్రహ్మవిష్ణూ ఊచతుః:—

సర్గాది పంచకృత్యస్య లక్షణం బ్రూహి నౌ ప్రభో!

బ్రహ్మావిష్ణువు లిట్లనిరి. హే ప్రభో సృష్ట్యాది పంచ కృత్యలక్షణములు మాకు దెలియజెప్పుము.

శివ ఉవాచ:—

మత్కృత్య బోధనం గుహ్యం కృపయా ప్రబ్రవీమి వామ్॥

సృష్టి స్థితిశ్చ సంహార స్తిరోభావోఽ ప్యనుగ్రహః।
పంచైవ మే జగత్కృత్యం నిత్యసిద్ధ మజాచ్యుతౌ॥ 2

పరమశివు డిట్లనెను. ఓ బ్రహ్మవిష్ణువులారా! నిగూఢము లగు నాపంచకృత్యములను ప్రేమచే మీకెఱిగించుచుంటిని. సృష్టి, స్థితి, సంహారము, తిరోభావము, అనుగ్రహము నను పంచజగత్కృత్యములు నాకు సహజసిద్ధములు.

సర్గ స్సంసార సంరంభ స్తత్ప్రతిష్ఠా స్థితి ర్మతా।
సంహారో మర్దనం తస్య తిరోభావ స్తదుత్క్రమః॥ 3

తన్మోక్షోఽ నుగ్రహ స్తన్మే కృత్య మేవం హి పంచకమ్।

సంసారారంభము సర్గము లేక సృష్టియనియు, సంసార వృద్ధి స్థితియనియు, సంసార నాశనము సంహారమనియు, సంసారము నుద్ధరించుటయే తిరోభావమనియు, ముక్తి నొసంగుటయే అనుగ్రహమనియు నీ పంచకృత్యములు నాకు గార్యములై యున్నవి.

కృత్య మేత ద్వహాత్యస్య స్తూష్ణీం గోపురబింబవత్॥ ౪
సర్గాది య చ్చతుః కృత్యం సంసారపరిజృంభణమ్।
పంచమం ముక్తిహేతుర్వై నిత్యం మయి చ సుస్థిరమ్॥ ౫

గోపురప్రతిబింబన్యాయమున నీకార్యము లన్యులచే (పృథివ్యాదులచే) నిర్వహింపబడుచున్నను సృష్టిమున్నగాగల సంసారవిజృంభణ కృత్యములు నాల్గును, ముక్తిహేతువగు నైదవ కృత్యమును, నిత్యము నాయందు స్థిరములై యున్నవి.

త దిదం పంచభూతేషు దృశ్యతే మామకై ర్జనైః।
సృష్టిర్భూమే స్థితిస్తోయే సంహారః పావకే తథా॥ ౬
తిరోభావోఽ నిలే తద్వ దనుగ్రహ ఇహాంబరే।

ఆ యీపంచకృత్య సముదాయము మదీయులగు జీవులచే పంచభూతములందు జూడబడుచున్నవి. భూమియందు సృష్టియును, జలమునందు స్థితియును, అగ్నియందు సంహారమును, వాయువునందు తిరోభావమును, ఆకాశమునం దనుగ్రహమును గాన్పించుచున్నవి.

సృజ్యతే ధరయా సర్వ మద్భి స్సర్వం ప్రవర్ధతే॥ ౭
ఆర్ద్యతే తేజసా సర్వం వాయునా చాపనీయతే।
వ్యోమ్నానుగృహ్యతే సర్వ మేవం జ్ఞేయం హి సూరిభిః॥ ౮

నాదివ్యతేజము ధరామూలమున సృష్టిని, జలమూలమున వృద్ధిని, అగ్నిమూలమున సంహారమును, వాయుమూలమున తిరోభావమును, ఆకాశమూలమున ననుగ్రహమును గావించుచున్నదని విజ్ఞులు గ్రహింపవలెను.

పంచకృత్యమిదం ఓఘుం మమా స్తి ముఖపంచకమ్।
చతు ర్దిక్షు చతు ర్వక్త్రం తన్మధ్యే పంచమం ముఖమ్॥ ౯

ఈపంచకృత్య భారమును వహించుటకు నాకైదు ముఖములు కలవు. నాల్గుదిక్కులందు నాల్గుముఖములును, వానికి మధ్య పంచమముఖమును గలవు.

యువాభ్యాం తపసాలబ్ధ మేతత్కృత్యద్వయం సుతౌ।
సృష్టి స్థిత్యభిదం భావ్యం మత్తః ప్రీతా దతిప్రియమ్॥ ౧౦
తథా రుద్ర మహేశాభ్యా మన్యకృత్య ద్వయం పరమ్।
అనుగ్రహాఖ్యం కేనాపి లబ్ధుం నైవ హి శక్యతే॥ ౧౧

వత్సలారా! మీరిరువురు తపస్సుచే బ్రీతుడనగు నా వలన సృష్టి, స్థితి యను కృత్యములను రెంటిని బొందితిరి. అట్లే రుద్రుండు మహేశ్వరుడును మిగిలిన సంహార తిరోభావం బులను కృత్యములను బొందిరి. కాని అనుగ్రహాకృత్యము నెవ్వరును గ్రహింపలేరు.

త త్సర్వం పౌర్వికం కర్మ యువాభ్యాం కాలవిస్మృతమ్।
న తద్రుద్రమహేశాభ్యాం విస్మృతం కర్మ తాదృశమ్॥ ౧౨
రూపే వేషే చ కృత్యే చ వాహనే చాసనే తథా।
ఆయుధాదౌ చ మత్సామ్య మస్మాభి స్తత్కృతే కృతమ్॥
మద్ధ్యాన విరహా ద్వత్సౌ మౌఢ్యం వా మేవ మాగతమ్।
మజ్జ్ఞానే సతి నైవం స్యా న్మానం రూపం మహేశవత్॥ ౧౪

కాలవశమున మీరలా పూర్వవృత్తాంత మంతయును మఱచి పోయితిరి. రుద్రుడు మహేశ్వరుడు నావృత్తాంతమును

మఱవలేదు. అందువలననే నేను వారికి రూపవేషకృత్యవాహ నాసనాయుధాదులందు నాతో సమానత్వము ననుగ్రహించితిని. ఓవత్సలారా! నాధ్యానము నెడల విముఖులగుటవలన వీరా కిట్టి మూర్ఖత్వము కలిగెను. నన్ను దెలిసికొనియున్నచో మహేశ్వరునకువలెనే యీవిధముగ దురభిమానము జనించియుండెడిదికాదు.

తస్మా న్మజ్జ్ఞాన సిద్ధ్యర్థం మంత్ర మోంకారనామకమ్।
ఇతః పరం ప్రజపతం మామకం మానభంజనమ్॥ ౧౫
ఉపాదిశం నిజం మంత్ర మోంకార మురు మంగలమ్।

అందుచే నన్నెఱుంగుటకై యింతటినుండి మదీయమును, దురభిమానవినాశకము నగు నోంకారరూపమంత్రమును జపించుడు. అధికమంగళకరమును, స్వీయము నగు నోంకారమంత్రమును బూర్వముపదేశించితిని.

ఓంకారో మన్ముఖా జ్జజ్ఞే ప్రథమం మత్ప్రబోధకః॥ ౧౬
వాచకోయ మహంవాచ్యో మంత్రో౽యం హి మదాత్మకః।
త దనుస్మరణం నిత్యం మమానుస్మరణం భవేత్॥ ౧౭

నన్ను తెలియజేయుచు నాముఖమునుండియే మొదట ఓంకారము జనించినది. ఇది నాకువాచకము. (నన్ను దెలియజేయును) నేను దీనికి వాచ్యుడను. (నేను దీనిచే దెలియబడుదును.) ఈ మంత్రము నాస్వరూపమే యైయున్నది. ఆమంత్రమును నిత్యము స్మరించుట నన్ను స్మరించుటయే యగును.

అకార ఉత్తరా త్పూర్వ ముకారః పశ్చిమాననాత్।
మకారో దక్షిణముఖా ద్బిందుః ప్రాఙ్ముఖత స్తథా॥ ౧౮

నాదో మధ్యముఖా దేవం పంచధాసౌ విజృంభితః।
ఏకీభూతః పున స్తద్వ దోమిత్యేకాక్షరోఽ భవత్॥ ౧౯

ప్రథమమున నుత్తరముఖమునుండి అకారము ప్రాదుర్భ వించెను. అంత పశ్చిమముఖమునుండి యుకారమును, దక్షిణ ముఖమునుండి మకారమును, ప్రాఙ్ముఖము (తూర్పు మొగము) నుండి బిందువును, మధ్యముఖమునుండి నాదమును ప్రాదుర్భ వించెను. మరల నేకమై "ఓమ్" అను నేకాక్షరరూపమును బూర్వమువలె బొందెను.

నానారూపాత్మకం సర్వం వేదభూత కులద్వయమ్।
వ్యాప్త మేతేన మంత్రేణ శివశక్త్యో శ్చ బోధకః॥ ౨౦

ఈ ఏకాక్షరమంత్రమే నానారూపాత్మకమైనది. ఇదియే సమస్తమును వేదములు, భూతములు నను నీరెండు తెగలు నియ్యదియే. ఈమంత్రముచే సమస్తము వ్యాపింపబడియున్నది ఈ ఏకాక్షరమంత్రమే శివశక్తుల నిరువురను అనగా ప్రకృతి పురుషద్వయమును బోధించునదై యున్నది.

అస్మా త్పంచాక్షరం జజ్ఞే బోధకం సకలస్యతత్।
అకారాది క్రమేణైవ నకారాది యథాక్రమమ్॥ ౨౧

అస్మా త్పంచాక్షరా జ్జాతా మాతృకాః పంచభేదతః।
తస్మా చ్ఛిర శ్చతు ర్వక్త్రా త్రిపాద్గాయత్రి రేవహి॥ ౨౨

వేద స్సర్వ స్తతోజజ్ఞే తతో వై మంత్రకోటయః।
త త్త న్మంత్రేణ తత్సిద్ధిః సర్వసిద్ధి రితో భవేత్॥ ౨౩

ఈ యోంకారమంత్రమునుండి అకారాదులందు క్రమ ముగా నకారాది పంచాక్షరములు సర్వజ్ఞానకరములై యుత్ప

న్నములయ్యెను. ఈపంచాక్షరములనుండి పంచమాతృకా వర్ణములు జన్మించెను. నా చతుర్ముఖములనుండియు త్రిపద సంకలితమగు గాయత్రి యుద్భవించెను. ఆగాయత్రినుండి వేదములన్నియును, వానినుండి కోటికోటిమంత్రములును జన్మించెను. ఆయా మంత్రములవలన నాయా ఫలితములే సిద్ధించునుగాని దీనివలన (ఓంకారమువలన) సర్వమును సిద్ధించును.

అనేన మంత్రకందేన భోగా మోక్షశ్చ సిద్ధ్యతి।
సకలామంత్రరాజానః సాక్షాద్భోగప్రదా శ్శుభాః॥ ౨౪

శుభమంత్రములన్నియు సాక్షాద్భోగమునిచ్చునవై యున్నవి. ఈ ఓంకారమంత్రముచే భోగము మోక్షముకూడ సిద్ధించును.

నందికేశ్వర ఉవాచ:—

పునస్తయోస్తత్ర తిరఃపటం గురుః
ప్రకల్ప్య మంత్రం చ సమాదిశత్పరమ్।
నిధాయ తచ్ఛిర్షి కరాంబుజం శనైః
ఉదఙ్ముఖం సస్థితయోస్సహాంబికః॥ ౨౫

నందికేశ్వరు డిట్లుచెప్పెను. గురువగు పరమేశ్వరుడు వస్త్రమును తిర్యక్కుగా (ఏటవాలు) ప్రకల్పించి బ్రహ్మవిష్ణువుల శిరస్సులందు కరకమలము నునిచి ఉత్తరాభిముఖులై కూర్చుండి యున్నవారలకు పార్వతీసహితుడై మరల నుత్కృష్టమగు నోంకారమంత్రము నుపదేశించెను.

త్రిరుచ్చార్యాగ్రహే స్మంత్రం యంత్రతంత్రోక్తిపూర్వకమ్।
శిష్యౌ చ తౌ దక్షిణాయాం మాత్మానం చ సమర్పయత్॥ ౨౬

ప్రబద్ధహస్తౌ కిల తౌ తదంతికే।
త మూచత ర్దేవవరం జగద్గురుమ్॥ ౨౭

యంత్రతంత్రోచ్చారణపూర్వకముగ నాశిష్యు లామంత్రమును మూఁడుసారు లుచ్చరించి. గ్రహించిరి. గురుదక్షిణగా నాత్మసమర్పణముగావించి కృతాంజలిపుటులై తత్సన్నిధానమున దేవశ్రేష్ఠుఁడును జగద్గురువు నగు మహాదేవునిగూర్చి యిట్లు పలికిరి.

బ్రహ్మాచ్యుతా వూచతుః:—

నమో నిష్కలరూపాయ నమో నిష్కలతేజసే।
నమ స్సకలనాథాయ నమ స్తే సకలాత్మనే॥ ౨౮

నమః ప్రణవవాచ్యాయ నమః ప్రణవలింగినే।
నమః సృష్ట్యాదికర్త్రే చ నమః పంచముఖాయ తే॥ ౨౯

పంచబ్రహ్మ స్వరూపాయ పంచకృత్యాయ తే నమః।
ఆత్మనే బ్రహ్మణే తుభ్య మనంతగుణశక్తయే॥ ౩౦

సకలాకల రూపాయ శంభవే గురవే నమః।
ఇతి స్తుత్వా గురుం పద్యై ర్బ్రహ్మావిష్ణుశ్చ నేమతుః॥ ౩౧

బ్రహ్మవిష్ణువు లిట్లనిరి నిర్గుణరూపుడవు, నిర్గుణతేజస్కుఁడవు, సకలజగన్నాథుడవు, సర్వమయుడవు, ఓంకారవాచ్యుడవు, ఓంకారచిహ్నుడవు, సృష్ట్యాదికర్తవు, పంచముఖుడవు నగు నో పరమేశా! నీకు నమస్కారము. పంచబ్రహ్మస్వరూపుండవు, పంచకృత్యస్వరూపుడవు నగు నీకు నమస్కారము. పరమాత్మవు, పరబ్రహ్మవు, అనంతగుణ శక్తిసంపన్నుడవు, సగుణనిర్గుణ రూపుడవు, శంభుడవు, గురుడవు

నగు నీకు నమస్కారము. ఇట్లు బ్రహ్మవిష్ణువులు పద్యములచే గురువగు పరమేశ్వరుని స్తుతించి నమస్కరించిరి.

ఈశ్వర ఉవాచ:—

వత్సకౌ! పరతత్త్వం చ కథితం దర్శితం చ వామ్।
జపతం ప్రణవం మంత్రం దేవదిష్టం మదాత్మకమ్॥ 37
జ్ఞానం చ సుస్థిరం భాగ్యం సర్వం భవతి శాశ్వతమ్।

ఓవత్సలారా! మీకు నేను సమస్తతత్త్వమును ప్రబోధించి ప్రదర్శించితిని. దేవచే నభిప్రేతమై మన్మయమై వెలయు నోంకారమంత్రమును జపింపు . అందువలన సుస్థిరజ్ఞానమును శాశ్వతభాగ్యములును గలుగును.

ఆర్ద్రాయాం చ చతుర్దశ్యాం తజ్జాప్యం త్వక్షయం భవేత్॥
సూర్యగత్యా మహార్ద్రాయా మేకం కోటిగుణం భవేత్।
మృగశీర్షాంతిమోభాగః పునర్వస్వాదిమ స్తథా॥ 38
ఆర్ద్రా సమం సదా జ్ఞేయం పూజాహోమాదితర్పణే॥

ఆ ఓంకారమంత్రమును ఆర్ద్రానక్షత్రమున, చతుర్దశీ దివసమున జపించిన అక్షయఫల మొసగును. సూర్యగత్యాను సారమదిమహార్ద్రయైన నొక్కటి కోటిగుణితమగు ఫలము నొసగును. మృగశీర్షా నక్షత్రమున నాల్గవపాదమును, పునర్వసునక్షత్రమున మొదటిపాదమును, పూజాహోమతర్పణాదులయందు ఆర్ద్రానక్షత్రసమములని గ్రహింపవలెను.

దర్శనం తు ప్రభాతే చ ప్రాతస్సంగమ కాలయోః॥ 39
చతుర్దశీ తథాగ్రాహ్యా నిశీథవ్యాపినీ భవేత్।
ప్రదోషవ్యాపినీ చైవ పరయుక్తా ప్రశస్యతే॥ 40

ప్రభాతము మొదలు సంగమకాలమువరకు (చతుర్థ పంచమ షష్ఠ ముహూర్తములవరకు) నన్ను దర్శించుట ప్రశస్తమైనది. నిశీథవ్యాపినియగు చతుర్దశియు, ప్రతిపద్యుక్త ప్రదోష వ్యాపినియగు చతుర్దశియు నాదర్శనమునకు ప్రశస్తములైనవి.

లింగం బేరం చ మే తుల్యం యజతాం లింగ ముత్తమమ్।
తస్మా ల్లింగం పరం పూజ్యం బేరాదపి ముముక్షుభిః॥ 32

నాలింగమును, ప్రతిమయును సమానములైనను నుపాసకులకు లింగమే యుత్తమమైనది. అందుచే ముముక్షువులకు ప్రతిమాపూజనముకంటె లింగార్చనమే యుత్కృష్టమైనది.

లింగ మోంకార మంత్రేణ బేరం పంచాక్షరేణతు!
స్వయమేవ హి స ద్ద్రవ్యైః ప్రతిష్ఠాప్యం పరై రపి॥ 33
పూజయే దుపచారైశ్చ మత్పదం సులభం భవేత్।
ఇతిశాస్య తథాశిష్యౌ తత్రైవాంతర్హితశ్శివః॥ 34

ఇతి శ్రీ శివమహాపురాణే విద్యేశ్వరసంహితాయాం దశమోఽధ్యాయః॥

ఓంకారమంత్రముచే లింగమును, పంచాక్షరమంత్రముచే ప్రతిమను సద్వస్తువులచే నర్చింపవలెను. పరప్రతిష్ఠితములైనను నాలింగమునుగాని ప్రతిమనుగాని పూజించువారలకు నాసన్నిధానము సుగమమగును. ఇట్లు శిష్యులగు బ్రహ్మవిష్ణువుల నాజ్ఞాపించి పరమప్రభువగు పరమేశ్వరుఁ డచ్చటనే యదృశ్యుఁడయ్యెను.

ఇది శ్రీ శివమహాపురాణమున విద్యేశ్వరసంహితయందు
పదియవ యధ్యాయము.



నమశ్శివాయైచ నమశ్శివాయ

# శివతాండవము

## సూత సంహితా

### అష్టమోఽధ్యాయః

### వ్యాఘ్రపురే దేవానా ముపదేశః

మునయ ఊచుః:—

ఏవం మహేశ్వరాద్ జ్ఞానం లబ్ధ్వా విష్ణుః సనాతనః।
తతః కి మకరో ద్విద్వ న్వద కారుణ్య విగ్రహా! ౧

మును లనిరి:—

ఇట్లు మహేశ్వరునివలన జ్ఞానమును పొంది, సనాతనుడగు విష్ణువు ఆపిదప ఏమిచేసెనో ఓసూతుడా! నీవు మాకెరుగ బలుకుము. నీవు సమస్తము నెరిగినవాడవు. కరుణయే స్వరూపముగా గలవాడవు.

సూత ఉవాచ:—

శ్రుణుధ్వం త త్ప్రవక్ష్యామి మునయః సంశ్రితవ్రతాః।
మహాదేవం నమస్కృత్య విష్ణు ర్వ్యాఘ్రపురం గతః॥ ౨

లౌకికై ర్వైదికై స్తోత్రైః స్తుత్వాఽనుజ్ఞా మవాప్య చ।
ఆరుహ్య గరుడం విప్రా అమరై రఖిలై ర్హరిః॥ 3

స్తూయమానో మహావిష్ణు ర్హృష్టో వైకుంఠ మాప సః।
తత స్తం సర్వలోకేశం శంఖచక్రగదాధరమ్॥ ४

శ్రీపతిం భూపతిం విప్రాః సురా బ్రహ్మపురోగమాః।
ప్రణమ్య దండన ద్భూమౌ భక్త్యా పరమయా సహ॥ ౫
కృతాంజలిపుటా భూత్వా పప్రచ్ఛుః పంకజేక్షణమ్।

సూతుడు చెప్పెను:—

ఉత్తమవ్రత మవలంబించి యున్న ఓమునులారా! అదియే చెప్పెద వినుడు. విష్ణువు వ్యాఘ్రపురమున కరిగి మహాదేవునకు నమస్కరించి, లౌకికములు వైదికములు నగు స్తోత్రములతో ఆమహాదేవుని స్తుతించెను. మఱియు నాయనవలన అనుజ్ఞపొంది గరుడు నధిరోహించి, ఓవిప్రులారా! ఆమహావిష్ణువు అఖిలామరస్తూయమానుడగుచు, వైకుంఠమున కేగెను. అపుడు సర్వలోకేశుడు, శంఖచక్రగదాధరుడు, శ్రీపతి, భూపతి, పుండరీకాక్షుడు నగు నాశ్రీమహావిష్ణువునుగని బ్రహ్మ మున్నగు దేవతలెల్లరు పరమమయిన భక్తితో చాగిలి సాష్టాంగ దండ ప్రణామ మాచరించి దోసిలిమొగ్గి నిలిచి యిట్లనిరి.

దేవా ఊచుః:—

భగవన్నీశ్వరా త్సర్వం భవతా శ్రుత మచ్యుత!॥ ౬
తత్సర్వం శ్రోతు మిచ్ఛామో బ్రూహి నః సంగ్రహేణ తత్।

దేవతలు పలికిరి:—

భగవంతుడవగు నో అచ్యుతా! ఈశ్వరునివలన నీవు ఏసమస్తము వినియుంటివో, అదంతయు మేము నీవలన విన గోరుచున్నాము. కావున అదంతయు నీవు మాకు సంగ్రహముగా నెఱిగింపుము.

విష్ణురువాచ:—

భవద్భి ర్యత్ప్రచ్ఛితం దేవా స్తద్ధితం సర్వదేహినామ్॥ ౭

తథాపి నాహం వక్ష్యామి శివ ఏవ ప్రవక్ష్యతి।
భవంతః శ్రద్ధయా సార్థం పుండరీకపురాభిదమ్॥ ౮

విష్ణువచను:—

దేవతలారా! మీరు వినదలచి నన్నడిగినది దేహధారుల కెల్లరకు హితకరమైనదే. అయినను దానిని నేను మీ కెరిగింపను. స్వయముగా శివుడే మీ కెరింగింపగలడు. కావున మీరు శ్రద్ధతో పుండరీకపురమను పేరుగల మహాతీర్థమున కరుగుడు.

స్వరాట్ సంజ్ఞస్య దేవస్య హృత్సరోరుహమధ్యగమ్।
దినే దినేథవా పక్షే పక్షే వా మాసి మాసి వా॥ ౯

షణ్మాసాంతేషు నాబ్దాంతే ష్వాశరీరవిమోక్షణాత్।
దృశ్యతే ప్రాణినా యేన శ్రద్ధయా తస్య ముక్తిదమ్॥ ౧౦

అచిరా త్సర్వపాపఘ్నం భోగదం భోగకామినామ్।

అది స్వరాట్ సంజ్ఞుడగు మహాదేవుని హృదయపుండరీకమధ్యమున నున్నది. (అనగా వ్యాపకమైన స్వరాట్ శరీరముయొక్క మధ్యమున వ్యాఘ్రపురమునందు శివుడు నిత్యసన్నిహితుడై యున్నాడు. కావున అదియే స్వరాట్ యొక్క హృత్సరోరుహమనియు, తన్మధ్యగతమనియు జెప్పబడినదని భావము) దినదినముగాని, లేదా పక్షమున పక్షమునగాని, నెల నెలగాని, ఆఱు నెలల కొకమాఱుగాని, లేదా ఎన్నో సంవత్సరములపైనగాని శరీరమును త్యజించులోపల ఏప్రాణి శ్రద్ధతో తన్ను దర్శించునో ఆ ప్రాణికి ఆ పుండరీకతీర్థము వెనువెంటనె ముక్తినొసగును. అది సమస్తపాపములను బోగడచివేయునది. భోగకాములగువారి కది భోగముల నిచ్చునదియై యున్నది.

ఉపేత్య సుమహాతీర్థం తపః కృత్వా సుదుశ్చరమ్॥ ౧౧
శ్రీమత్పంచాక్షరం మంత్రం సతారం సర్వసిద్ధిదమ్।
సర్వమంత్రవరం నిత్యం శతరుద్రీయమధ్యగమ్॥ ౧౨
జపిత్వా లక్ష మేకంవా శ్రీమద్దభ్రసభాపతిమ్।
దృష్ట్వా పంచాక్షరేణైవ సతారేణాస్తికాః సురాః॥ ౧౩

ఆ మహాతీర్థమును జేరి సుదుశ్చరమైన తపమాచరించి సర్వసిద్ధిదము, సర్వమంత్రవరము, శతరుద్రీయ మధ్యగము నగు శ్రీమత్పంచాక్షరమంత్రమును సతారముగా, అనగా సప్రణవముగా నిత్యమును లేదా ఒకలక్ష జపింపుడు. అపుడు శ్రీమద్దభ్రసభాపతియగు మహేశ్వరుడు మీ కన్నులకు గోచరింపగలడు, సురలారా! అప్పుడా మహాదేవుని మీరు ఆస్తిక భావ సమన్వితులై సతారమగు నా పంచాక్షర మంత్రముతోడనే పూజింపుడు.

పూజయధ్వం మహాదేవం యుష్మాకం కరుణాకరః।
అంబికాపతి రానందమహాతాండవపండితః॥ ౧౪
సర్వాధారవటచ్ఛాయానిషణ్ణో భూతిభూషణః।
సోమార్ధశేఖరః సోమః సోమసూర్యాగ్నిలోచనః॥ ౧౫
కపర్దీ కాలకంఠశ్శ్రీ శ్వేదయజ్ఞోపవీతవాన్।
గంగాధరః సుప్రసన్నః సుస్మితో నాగభూషణః॥ ౧౬
దీర్ఘబాహు ర్విశాలాక్షస్తుంగస్కంధవిరాజితః।
హారకేయూరకటక నూపురాది విభూషితః॥ ౧౭
భస్మధారాధరః శ్రీమా న్నాగకుండలమండితః।
పవిత్రపాణి ర్భగవా న్పుండరీకత్వగంబరః॥ ౧౮

క్వణత్కింకిణి సంయుక్త కలకాంచీ విరాజితః।
సర్వాభరణసంయుక్తః సర్వలక్షణసంయుతః॥ ౧౯
గోక్షీరధవళాకారః కుందేందుసదృశప్రభః।
సంసారభయభీతానా మేకేనైవాఽభయప్రదః॥ ౨౦
అన్యేన పాణినా సర్వభక్తపాణి పరిగ్రహః।
తదన్యకరసంలగ్న సమ్యగ్డమరుకధ్వనిః॥ ౨౧
వామభాగోర్ధ్వపాణిస్థ మహాదీప్త హుతాశనః।
కృపయైవాత్మమాయోత్థ ఘోరాపస్మారసంస్థితః॥ ౨౨
స్వస్వరూపమహానంద ప్రకాశాఽప్రచ్యుతో హరః।
ప్రసన్నః సర్వవిజ్ఞాన ముపదేక్ష్యతి స ప్రభుః॥ ౨౩

మీరొనరించిన ఆపూజలందుకొని పరమకరుణాకరుడు, ఆనంద మహాతాండవపండితుడు, అంబికాపతి, సర్వాధారమైన వటవృక్షచ్ఛాయయందు కూర్చుండియున్నవాడు, భూతిభూషణుడు, సోమార్థశేఖరుడు, ఉమాసహితుడు, సోమసూర్యాగ్ని లోచనుడు, కపర్ది అనగా జటామండితుడు, కాలకంఠశ్రీసంవలితుడు, వేదయజ్ఞోపవీతి, గంగాధరుడు, సుప్రసన్నుడు, సుస్మితుడు, నాగాభరణుడు, దీర్ఘబాహుడు, విశాలాక్షుడు, ఎగుభుజములుగలవాడు, హారకేయూరకటకాది విభూషణ విభూషితుడు, ఫాలఫలకమున భస్మధారనుధరించినవాడు, శ్రీమన్నాగకుండల మండితుడు, పవిత్రపాణి, భగవానుడు, వ్యాఘ్రచర్మాంబరధారి, మెరయు చిఱుగజ్జెలతోడి బంగారు మొలనూలు దాల్చి విరాజిల్లువాడు, సర్వాభరణసంయుక్తుడు, సర్వలక్షణ సమన్వితుడు, ఆవుపాలవలె తెల్లనిఆకారముగలవాడు, మొల్ల

పూలతో, చంద్రునితో సమానమైన దేహకాంతి గలవాడు, సంసారభయభీతులగు వారికి ఒక హస్తముతో అభయప్రదానము చేయుచు, మరొకచేతితో నెల్లభక్తులను జీవులను అభిమతవరప్రదానమున ననుగ్రహించుచు, మరొకచేతియందున్న డమరుకమును ధ్వనింపజేయుచు. వామభాగమునందలి ఊర్ధ్వహస్తమునందు మహాదీప్తితో వెలుగొందుచున్న అగ్నిహోత్రుని ధరించి. స్వమాయచేతనే పొడమిన ఘోరాపస్మారమును కృపతోడనే నిజపాదమున నాక్రమించియున్నవాడు, స్వస్వరూపమగు మహానంద ప్రకాశమునుండి యెన్నడును చ్యుతినొందనివాడు హరుడు నగు మహాదేవుడు ప్రసన్నుడై మీకు పరమకృపతో సర్వవిజ్ఞానము నుపదేశింపగలడు.

సూత ఉవాచ:—

పుండరీకపుర మాపు రాస్తికాః
శ్రద్ధయైవ సహ యత్ర నృత్యతి।
అంబికాపతి రశేషనాయక
శ్చంద్రమౌలి రఖిలాసురాముదా॥ ౨౮

సూతుడు చెప్పెను:—

విష్ణుని పలుకులు విని దేవతలెల్లరు వల్లెయని, ఆస్తికభావ పరిపూర్ణులై, అతిశ్రద్ధతో పుండరీక పురమున కరిగిరి. అచ్చట అశేషనాయకుడగు అంబికాపతి చంద్రకళను ధరించి ఎల్లపుడు నృత్యము నాచరించుచుండును.

తతః సురా శ్చేను రతీవ సత్తమా
విలక్షణా భూతివిభూషితా శ్చిరమ్।

వ్రతాని దానాని తపాంసి చాదరా
న్మునీశ్వరాః సర్వజగత్ప్రియే రతాః॥ ౨౫

అనంతరము మునీశ్వరులారా! సురలెల్లరు అతి సద్భావమును వహించి విలక్షణులై భూతినలదుకొని చిరకాలము వ్రతములు, దానములు, తపస్సులు సర్వజగత్ప్రియనిరతులై పరమాదరమున నాచరించిరి.

పంచాక్షరం పరమమంత్ర మశేషవేద
వేదాంతసార మతిశోభన మాదరేణ,
జప్త్వా సురాః ప్రణవసంయుత మంబికేశం
దృష్ట్వా సభాపతి మశేషగురుం ప్రణమ్య॥ ౨౬

అశేష వేదవేదాంతసారము, అతిశోభనము, పరమ మంత్రము నగు పంచాక్షరమును సప్రణవముగా జపించి, దేవతలు సభాపతి, అశేషగురువు నగు అంబికాపతిని దర్శించి—

భక్త్యా పూజ్య మహేశ్వరాఖ్య మమలం
భక్తిప్రదం ముక్తిదం
శక్త్యా యుక్త మతిప్రసన్నవదనం
బ్రహ్మేంద్రపూర్వా స్సురాః।
నిత్యానంద నిరంజనామృత పద
జ్ఞానానుభూత్యా సదా
నృత్యంతం పరమేశ్వరం పశుపతిం
భక్త్యైకలభ్యం పరమ్॥ ౨౭

మహేశ్వరాభిధానుడు, అమలుడు, భక్తిప్రదుడు, ముక్తినొసగువాడు, శక్తియుక్తుడు, అతిప్రసన్నవదనుడు, నిత్యా

నంద నిరంజనామృతపరజ్ఞానానుభవమున నెల్లప్పుడు తాండవము నాచరించుచున్నవా , పశుపతి భక్త్యైకలభ్యుడు, పరుడు, నగు పరమేశ్వరుని బ్రహ్మేంద్రాది బృందారకు లెల్లరు పరమభక్తిభావమున పూజించి,

లౌకికేన వచసా మునీశ్వరా
వైదికేన వచసా చ తుష్టువుః,
దేవదేవ మఖిలార్తిహారిణం
బ్రహ్మవజ్రధరపూర్వకాః సురాః॥ ౨౮

దేవదేవుడు, అఖిలార్తిహరుడు, నగు నామహేశ్వరుని, లౌకికము వైదికము నగు వాక్కులతో వారు స్తుతించిరి.

మునీశ్వరా మహేశ్వరః సమస్త దేవనాయకః
సురేశ్వరా న్నిరీక్షణా న్నిరస్తపాపపంజరాన్।
అనుగ్రహేణ శంకరః ప్రగృహ్య పార్వతీపతిః
సమస్తవేదశాస్త్రసారభూత ముత్తమోత్తమమ్॥ ౨౯

ప్రదర్శయ న్నమేశ్వరః సమస్తదేవసంనిధౌ
స్వనర్తనం విముక్తిదం మహత్తరం మహేశ్వరః।
సమస్తలోకరక్షకం మహాత్మనాం హృది స్థితం
నిరీక్షణార్హ మీశ్వరోఽకరో త్సభాపతిః శివః॥ ౩౦

ఓమునీశ్వరులారా! సమస్తదేవనాయకుడగు మహేశ్వరుడప్పు తన వీక్షణావశముచేతనే సమస్తపాపములు తొలగి పవిత్రులైయున్న దేవతల నెల్లరను, అనుగ్రహముతో గ్రహించి, సమస్తవేదశాస్త్రసారభూతము, ఉత్తమోత్తమము, నగు విజ్ఞానమును ప్రదర్శించుచు (దేవతల కది అప

రోత్కృము గావింపదలచి) ఆ దేవతలందఱి యెదుట నామహేశ్వరుడు విముక్తిదము, మహత్తరము, సమస్తలోకరక్షకము, మహాత్ముల హృదయములం దెల్లపుడు నెడబాయక యుండునది, కనుగొనదగినదియు నగు స్వతాండవమును అత్యద్భుతముగా గావించెను.

పశుపతితాండవదర్శనా త్సురాః
పరమముదా వివశా విచేష్టితాః।
పున రమలా మహేశ్వరం ప్రణమ్య
ప్రియవదనం వినయేన సంయుతాః॥ 30

పశుపతి తాండవమును గని సురలెల్లరు పరమానందమున వివశులై చేష్టలుడిగిరి. వెండియు నిర్మలులగు నా దేవతలు ప్రియవదనుడగు మహేశ్వరునికి మ్రొక్కి వినయసమన్వితులై యిట్లడిగిరి.

పప్రచ్ఛుః పరమేశ్వరం పశుపతిం
పార్శ్వస్థితాంబాపతిం
సర్వజ్ఞం సకలేశ్వరం శశిధరం
గంగాధరం సుందరమ్।
విజ్ఞానం నిఖిలా స్సురాః శ్రుతిగతం
సంసారదుఃఖాపహం
నిర్ద్వంద్వో భగవాన్ శివోఽఖిలగురుః
ప్రోవాచ కారుణ్యతః॥ 31

అప్పు డంబికాదేవి పశుపతియగు పరమేశ్వరుని పార్శ్వముననే వెలుగొందుచుండెను. సర్వజ్ఞుడు, సకలేశ్వరుడు, శశి

ధరుడు, గంగాధరుడు నగు నాదేవదేవుడు అతిసుందరస్వరూపమున దర్శనీయతముడై యుండెను. అట్టి ఆమహాదేవుని దేవతలెల్లరు శ్రుతిగతము, సంసారదుఃఖాపహము, నగు విజ్ఞానము నుపదేశింపుమని ప్రార్థించిరి. అపుడు నిర్ద్వంద్వుడు, అఖిలగురువు నగు శివభగవానుడు పరమకరుణతో వారి కిట్లనియె.

ఈశ్వర ఉవాచ:—

వక్ష్యామి పరమం గుహ్యం విజ్ఞానం సురసత్తమాః ।
యుష్మాకం శ్రద్ధయా సార్ధం శృణుధ్వం తత్సమాహితాః॥

ఈశ్వరుడు చెప్పెను. సురోత్తములారా! పరమము, గుహ్యము నగు విజ్ఞానమును మీకెఱిగించెదను. మీరు శ్రద్ధావంతులై సమాహితమతులై అద్దాని నాలకింపుడు.

ఆత్మాతావ త్సురా అస్తి స్వసంవేద్యో నిరాస్పదః ।
ఆనందః పూర్ణచైతన్యః సదా సోఽహం న సంశయః ॥

సురలారా! ఆత్మస్వయముగా అస్తిత్వరూపమున నొప్పుచున్నాడు. మాయాతత్కార్యజాతమంతయు నాత్మాస్పదమై యున్నది. ఆత్మమాత్రము నిరాస్పదుడు. అతడు స్వసంవేద్యుడు. అవాఙ్మానసగోచరుడగు ఆ ఆత్మవిషయమై స్వభావభూతమగు స్వప్రకాశమే ముఖ్యమైన ప్రమాణముగా నొప్పుచున్నది. మఱియు నాతడు పరిపూర్ణచైతన్యస్వరూపుడు, ఆనందమును. (అతిప్రయత్నమున నా ఆత్మనెఱిగికొన్నచో అఖండానందము ప్రాప్తమగునని భావము.) ఆ ఆత్మయే నిరంతరము నీ జీవుడై యున్నాడు. (అనగా ముక్తి

పర్యంతము జీవేశ్వరులకు భేదమే. ముక్తి కలిగిననాడు మాత్రము జీవునకును, ఈశ్వరునకును భేదము లేదు. అని కొందఱందురు. అది సరియైనది కాదు. జీవు డనుక్షణము ఆపరమాత్మయే అని భావము. ఇందుపరమాత్మ — సత్యము, జ్ఞానము, అనంతము, ఆనందము, ప్రత్యక్ష అని యాపపంచకమున బోధింపబడెనని యెఱిగికొనునది, ఇందు సందియము లేదు.

తస్య కాచి త్సురాః శక్తి ర్మాయాఖ్యాఽస్తి విమోహినీ।
విచారవేలాయాం నాఽఽత్మా భవ త్యేన నచాన్యథా ॥

ఆ పరమాత్మకు అనగా ఆ పరమాత్మ నాశ్రయించి అనపాయినియై మాయ యనబడు శక్తిగలదు. అది సర్వవిమోహకారిణియై యున్నది. ఆ మాయాశక్తిశక్తుడగు నాత్మ నాశ్రయించి యుండుటవలన విచారించి చూచినచో ఆ ఆత్మయే యగునుగాని వేఱొండుగాదు.

తదభేదేన సోఽప్యాత్మా ప్రలయే జగతః స్థితః।
తస్మిన్ ప్రపంచసంస్కారః స్థితః సర్వః సురోత్తమాః ॥

ఈ జగత్తంతయు పూర్ణముగా లయించి పోయినసమయమున నా ఆత్మతిదభేదముతో అనగా ఆ మాయను తన యందు లయింపజేసికొని అద్వయరూపుడై యుండెను. (అనగా సమస్తప్రపంచములు గ్రసించివైచిన మాయ ఆత్మ ప్రతిష్ఠ మగుటవలన అత్యంత నిర్వికల్పకమైన చైతన్యముతో నివిచ్యమానమగుచున్నను తాదాత్మ్యాధ్యాసవలన ఆత్మప్రకాశము చేతనే ప్రకాశమానమై వర్తించును అని భావము.) భోగ్య

ప్రపంచమంతయు ఆ (మాయాశబలిత) ఆత్మయందు విలీనమై సంస్కారరూపమున నున్నది.

స్వభావాదేవ సంక్షుబ్ధా వాసనా కర్మణా భవేత్ ।
తత స్తత్క్షోభయుక్తాత్మాऽవిక్రియోऽపి స్వభావతః॥ ३९
క్షోభకః కాలత త్త్వస్య పునః కాలేన సంయుతః ।
ఈక్షణం పూర్వవత్ కృత్వా పునర్బ్రహ్మాదికం జగత్॥

సంస్కారమనబడు వాసన స్వభావమువలననే అనగా వాసనావశముననే పరిపాకమును పొందిన కర్మచేత క్షోభింపజేయబడును. స్వస్వభావమున విక్రియారహితుడే అయినను ఆత్మ అపుడు తత్క్షోభమున అనగా వికృతవాసనా సంయోగమున వికారములు పొందిన వాడువలె నయి, కాలతత్త్వములు క్షోభింపజేయును. మఱియు కాలముతో గూడినవాడై ఈ క్షణమును గావించి, మొదటివలెనే బ్రహ్మాదికమైన జగత్తునంతయు సృజించును.

సృష్ట్వాऽనుప్రాప్య తన్మోహా త్సురాః సంసారమండలే ।
జ్ఞేయజ్ఞాత్రాదికేశుద్ధే స్వప్నతుల్యే మహత్తరే॥ ३౯
అనాద్యంతేऽవశో భూత్వా సురాః కర్మానురూపతః ।
విచిత్రాం యోని మాసాద్య సుఖదుఃఖాది పీడితః॥ ४०

మాయాతీతుడగు పరమాత్మ పాపికర్మ ప్రేరణాజనిత లీలాసర్గమున ప్రవృత్తుడై విశుద్ధసత్త్వప్రధాన మాయోపాధికుడై స్రష్టయై రాజస తామస మాయామయము భోక్తృభోగ్యలక్షణము నగు ప్రపంచమును అట్లు సృజించి, తత్తాదాత్మ్యాభిమానమును తదనుప్రవేశమును గావించుచున్నాడు.

ఓ సురలారా! తన్మోహమున జీవుడు జ్ఞేయజ్ఞాత్రాదిమయము, సుఖదుఃఖమయము స్వప్నతుల్యము, అనాద్యంతము, అతి మహత్తరము నగు సంసారమండలమున నిజకర్మానురూప ముగా విచిత్రమగు యోనినిపొంది వివశుడై సుఖదుఃఖాదులచే ప్రపీడితు డగుచున్నాడు. (సంసారము అనంతము. అనగా సంసారమునకు బొత్తుగా అంతమే లేదని అర్థముకాదు. ఆత్మ జ్ఞానము సాక్షాత్తు కలుగనిచో దానికి అంతమే లేదని యెఱిగి కొనవలెను.)

పూర్వజన్మార్జితా త్పుణ్యా న్నరో భూత్వా మహీతలే।
మత్ప్రసాదేన వేదోక్తం కర్మ కృత్వా విశుద్ధధీః। ౪౧

విచార్య సర్వం దుఃఖాఢ్య మనిత్యం సారవర్జితమ్।
విరక్తో మోక్షమాకాంక్ష న్మోక్షోపాయం మహత్తరమ్॥

వేదేన దర్శితం సమ్య క్సంపాద్యా స్మత్ప్రసాదతః।
ఆత్మమాత్రాం పరాం ముక్తిం ప్రాప్నోత్యాత్మా స్వయం
సురాః॥ ౪౩

పూర్వజన్మార్జిత పుణ్యబలము వశమున జీవుడు మహీ తలమునందు నరుడై పుట్టి, మదనుగ్రహమున వేదోక్త మగు కర్మనాచరించి, విశుద్ధబుద్ధిగలవాడై సమస్తము దుఃఖభూయి ష్ఠము, అనిత్యము, సారరహితము నని విచారించి యెఱిగికొని, విరక్తుడై మోక్షమును గోరుచు వేదప్రదర్శితమైన సుమహా త్తర మోక్షోపాయమును అస్మత్ప్రసాదవశమున లెస్సగా బడసి, ఆత్మస్వరూపమాత్రమేయగు ముక్తిని స్వయముగా బొందుచున్నాడు.

సర్వేషా మాత్మవిజ్ఞానాదేవ ముక్తి ర్న చాన్యతః।
జ్ఞానా దన్య త్సురాః సర్వం విజ్ఞానస్యైవ సాధనమ్॥ ౨౪

ఎల్లరకును ఆత్మవిజ్ఞానమువలననే ముక్తి లభించును గాని, మరియొకదానివలన లభింపనేరదు. కావున ఓసురలారా! జ్ఞానముకంటె నన్యమైన దంతయు విజ్ఞానమునకు సాధనము మాత్రమే యగుచున్నది.

తత్ర శాంత్యాదికం సర్వ మిహైవ జ్ఞానసాధనమ్।
మమ స్థానే మృతిః శుద్ధే వారాణస్యాదికే సురాః॥ ౨౫
అయోగ్యానాం చ యోగ్యానాం నరాణాం మరణాత్పరమ్॥
విశుద్ధబ్రహ్మవిద్యాయాః సాధనం సురసత్తమాః॥ ౨౬

అందు శమదమాదికమంతయు నీజన్మమునందే జ్ఞానసాధన మగుచున్నది. పవిత్రమై నాక్షేత్రమగు వారాణస్యాదికమునందు మరణము అయోగ్యులు యోగ్యులు నగు నరులకెల్లరకు ఉత్తమ మరణముగా జెప్పబడుచున్నది. అది (పరజన్మమునందు) విశుద్ధబ్రహ్మవిద్యోదయమునకు సాధనము కాగలదు.

శ్రీమత్పంచాక్షరో మంత్రో మంత్రాణా ముత్తమోత్తమః।
మార్గాణాం వేదమార్గశ్చ ప్రాప్యానాం ముక్తి రుత్తమా॥

అన్ని మంత్రములయందు శ్రీమత్పంచాక్షరమంత్రము ఉత్తమోత్తమము. అన్నిమార్గములయందు వేదమార్గము శ్రేష్ఠము. ప్రాప్యములగు వానియన్నింటిలో ముక్తి ఉత్తమ మయినది.

దేవతానా మహం ముఖ్యః స్థానానాం సురసత్తమాః।
మమ స్థానాని ముఖ్యాని తేషాం వారాణసీ తథా॥ ౪౮

ఓ దేవతలారా! దేవతలలో నేను ముఖ్యుడను. స్థానములలో నాస్థానములు ముఖ్యమైనవి. వానిలో వారాణసి అతి ముఖ్యమైనది.

శ్రీకాలహస్తిశైలాఖ్యం శ్రీమద్వృద్ధాచలాభిదమ్ ।
పుండరీకపురం తద్వ చ్ఛ్రీమద్వల్మీక ముత్తమమ్॥ ౪౯

వేదారణ్యం సమాఖ్యం చ స్థానం ముఖ్యం సురోత్తమాః।
ఏషాం ముఖ్యతమా ఖ్యాతా శ్రీమద్వారాణసీపురీ॥ ౫౦

శ్రీకాలహస్తిశైలము, శ్రీమద్వృద్ధాచలము, పుండరీకపురము, అట్లే శ్రీమద్వల్మీకక్షేత్రము, వేదారణ్యము ఈ మున్నగునవి నాస్థానములలో ముఖ్యములుగా జెప్పబడుచున్నవి. వీనియన్నింటిలోను శ్రీమద్వారాణసీపురి ముఖ్యతమమైనదిగా నెఱిగికొనవలెను.

పుండరీకపుర మప్యతిప్రియం
విత్త సర్వసురసత్తమా మమ।
భుక్తిముక్తికర మాశు దేహినాం
భక్తిలభ్య మతిశోభనం సదా॥ ౫౧

మఱియు సురలారా! పుండరీకపురమునయితము నాకత్యంతము ప్రియమైనది. అది సమస్తదేహులకు భుక్తిని, ముక్తిని, దయచేయునది. కేవలభక్తిచే నది లభ్యమయినది. అతి శోభనము.

అస్మాభిః సురసత్తమా అభిహితం
విజ్ఞానమత్యద్భుతం
యుష్మాకం మునిపుంగవై రపి
తథా సర్వార్థపారంగతైః।
మద్భక్తై రతిశోభనం పురవరం
సంసేవనీయం నరై
ర్ముక్త్యర్థం పరమాస్తికై రితి
పరా సాధ్వీ శ్రుతి ర్వక్తి హి॥ ౭౨

ఓసురసత్తములారా! మాచే మీకత్యద్భుతమైన విజ్ఞానము ఉపదేశింపబడినది. మఱియును సర్వార్థపారంగతులగు మునిపుంగవులచేతను, మద్భక్తులగు నరులచేతను, అతిశోభనమైన వారాణసీపురవరము పరమాస్తికభావమున ముక్తికొఱకై సంసేవింపబడదగి యున్నది. అని పరమసాధ్వియగు శ్రుతి ("స భగవః కస్మిన్ ప్రతిష్ఠిత ఇతి వరణాయామ్" ఇత్యాది ప్రకారమున) ఉద్ఘోషించుచున్నది.

సూత ఉవాచ:—

ఏవం మహేశ్వరః సాక్షాత్ శ్రీమద్దభ్రసభాపతిః।
దేవదేవో జగన్నాథః పశుపాశవిమోచకః॥ ౭౩

ఆమ్నాయాంతైకసంవేద్యః సాక్షీ సర్వస్య సర్వదా।
అంబికాసహితః శ్రీమాన్ ప్రోవాచ జ్ఞాన ముత్తమమ్॥

సూతుడు చెప్పెను:—

ఇట్లు శ్రీమద్దభ్రసభాపతియు, దేవదేవుడు, పశుపాశవిమోచకుడు, జగన్నాథుడు, నిగమాంతసంవేద్యుడు సర్వదా

సర్వసాక్షియు, అంబికాసహితుడు నగు శ్రీమన్మహేశ్వరుడు స్వయముగా దేవతలకు ఉత్తమజ్ఞానము నుపదేశించెను.

దేవాశ్చ బ్రహ్మవిజ్ఞానం వేదాన్తోత్థం విముక్తిదమ్।
శ్రుత్వా సర్వేశ్వరం విప్రాః ప్రణిపత్య మహీతలే॥ ౫౫
లౌకికై ర్వైదికై స్తోత్రైః స్తుత్వా భక్త్యా సభాపతిమ్।
పూజాం ప్రచక్రిరే దేవాః శ్రీమత్పంచాక్షరేణవై. ౫౬

ఇతి శ్రీస్కాందపురాణే సూతసంహితాయాం ముక్తిఖండే వ్యాఘ్రపురే దేవోపదేశ కథనం నామాఽష్టమోఽధ్యాయః.

దేవతలును వేదాంతనిష్పన్నము, విముక్తిదము నగు బ్రహ్మవిజ్ఞానమును పరమేశ్వరునివలన విని, ఓమహర్షులారా! నెన్నుదురు క్షోణితలమునంటి నామహాదేవునికి నమస్కరించి, లౌకికములు, వైదికములు నగు స్తోత్రములతో స్తుతించి, శ్రీమత్పంచాక్షరమహామంత్రముతో నాసభాపతిని అత్యంత భక్తిభావమున పూజించిరి.

ఇది శ్రీస్కాందపురాణమున సూతసంహితయందు ముక్తిఖండమున వ్యాఘ్రపురమునందు దేవోపదేశకథనమను నెనిమిదవ అధ్యాయము.

—*—

## నవమోఽధ్యాయః

### ఈశ్వర నృత్య దర్శనమ్.

**మునయ ఊచుః :—**

భవతా సర్వ మాఖ్యాతం సంక్షేపా ద్విస్తరా దపి।
భవత్ప్రసాదా దస్మాభి ర్విజ్ఞాతం చ విచక్షణ!॥ ౧

మునులు పలికిరి :—

సూతా! నీవతివిచక్షణుడవు. నీవు చేయుదీని దాని నంతయు సంక్షేపముగను, విస్తరముగను జెప్పితివి. నీ ప్రసాదమున మే మది యెఱిగికొనగలితిమి.

తథాపి దేవదేవస్య శివస్య పరమాత్మనః ।
విశ్వాధికస్య రుద్రస్య బ్రహ్మాణః సర్వసాక్షిణః ॥
నర్తనం ద్రష్టు మిచ్ఛామః శంకరస్యాంబికాపతేః ।
అతః కారుణ్యతోఽస్మాకం తదుపాయం వదాద్భుతమ్ ॥

అయినను మేమిక దేవదేవుడు, పరమాత్మ, విశ్వాధికుడు రుద్రుడు, బ్రహ్మ, సర్వసాక్షి, శంకరుడు, అంబికాపతియు నగు శివునినర్తనమును దర్శింపగోరుచున్నాము. కావున దయతో నీవద్దానికి దగు నద్భుతోపాయమును మాకెఱింగింపుము.

సూత ఉవాచ :—

శ్రుణుధ్వం తత్ప్రవక్ష్యామి శ్రద్ధయా వేదవిత్తమాః ।
పురా నందీశ్వరం ధీమా నపృచ్ఛ చ్ఛౌనకో మునిః ॥ ౪
సోఽపి కారుణ్యతః శ్రీమా న్నందీ వేదవిదాం వరః ।
శౌనకాయాబ్రవీ న్నత్వా మహాదేవం ఘృణానిధిమ్ ॥ ౫

సూతుడు చెప్పెను :—

వేదవిత్తములగు రోమహర్షులారా! మీ కద్దానిని నే నెఱింగించెద. శ్రద్ధతో నాలింపుడు. పూర్వము ధీమంతుడగు శౌనకముని నందీశ్వరు నిదియే ప్రశ్నించెను. వేదవిద్వరుడగు నా నందీశ్వరుడును, కరుణానిధియగు మహేశ్వరున కెఱగి, శౌనకునకు దయతో నిట్లు చెప్పెను.

నందికేశ్వర ఉవాచ :—

కైలాసే సంధ్యయోః శంభుః కరో త్యానందన ర్తనమ్।
తచ్ఛివా కేవలం పశ్య త్యన్య స్తత్ర న పశ్యతి॥ ౬

నందీశ్వరుడు చెప్పెను :—

కైలాసమునందు ఉభయసంధ్యలయందును శంభుడానందతాండవమును నిత్యము గావించుచుండును. ఆ తాండవమును కేవల మొక శివాభవానిమాత్రమే చూచుచుండునుగాని, మఱియొక డెవ్వరును జూడలేరు.

పుండరీక పురే రుద్రః శౌనకాऽऽనందన ర్తనమ్।
శ్రీమద్దభ్రసభామధ్యే కరోతి భగవాన్ సదా॥ ౭
తత్రాపి శౌనకాంబాపి స్కందో విఘ్నేశ్వరోపి చ।
క్షేత్రపాలో మయా సార్థం పశ్యం త్యన్యో న పశ్యతి. ౮

శౌనకా! పుండరీకపురమునందు శ్రీమద్దభ్రసభామధ్యమున శివభగవాను డెల్లప్పుడు ఆనందతాండవ మొనరించుచుండును. అచ్చటగూడా శౌనకా! రుద్రుని ఆ ఆనందనర్తనమును కుమారస్వామి, విఘ్నేశ్వరుడు, క్షేత్రపాలుడు, నేను మాత్రమే చూడగలుగుదుము. మఱొక డెవడును అద్దానిని గనుగొననేరడు.

యేషాం ప్రసాదో దేవస్య శౌనకాऽస్తి మహత్తరః।
తే ప్రపశ్యంతి తత్రైవ మహానర్తన మైశ్వరమ్॥ ౯

శౌనకా! ఎవరికి దేవదేవుడగు మహాదేవుని మహత్తరమగు ననుగ్రహభాగ్యము గలదో, వారుమాత్రమే మహే

శ్వరుని మహానర్తనమును అచ్చటనే అనగా ఆ పుండరీక పురమునందే చూడగలుగుదురు.

తస్మాత్ప్రసాదసిద్ధ్యర్థం శౌనక శ్రద్ధయా సహ।
పుండరీకపురం గత్వా రవౌ చాపస్థితే సతి॥ ౧౦
ఆర్ద్రాయాం ప్రాతరేవ త్వం శుచిర్భూత్వా సమాహితః।
శివగంగాభిధే తీర్థే స్నానం కృత్వా మహత్తరే॥ ౧౧
యథాశక్తి ధనం ధాన్యం దత్వాఽన్యద్వాఽనసూయవే।
ఉపోష్య దినమేకం వా శ్రీమూలస్థాననాయకమ్। ౧౨
భక్త్యా ప్రదక్షిణీకృత్య ప్రణమ్య భువి దండవత్।
శ్రీమత్పంచాక్షరం మంత్రం జపిత్వాఽయుత మాదరాత్॥

కావున నో శౌనకా! నీవు శివభగవానుని ప్రసాద సంసిద్ధికై శ్రద్ధబూని పుండరీకపురమున కఱిగి, సూర్యుడు ధనూరాశియందుండగా, ఆర్ద్రానక్షత్రమున ప్రాతఃకాలము నందే శుచివై, సమాహితత్వమునుబూని శివగంగ యను పేరుగల తీర్థరాజమునందు స్నానమొనరించి, ధనముగాని, ధాన్యముగాని, మఱియొక్కటిగాని అసూయారహితుడగు వానికి పాత్రునకు శక్తివంచనలేకుండ దానముజేసి, ఒక్క దినముగాని ఉపవసించి, శ్రీమూలస్థాననాయకుడగు గౌరీ నాయకుని భక్తితో ప్రదక్షిణించి, సాష్టాంగ దండప్రణామము లతో గొలిచి, శ్రీమత్పంచాక్షరమంత్రమును మహాదరమున పదివేలు జపింపుము.

దినే దినే ముహూర్తాంతే స్నానం కృత్వా యథాపురా।
ప్రణమ్య దేవ మీశానం శ్రీమూలస్థాన నాయకమ్॥ ౧౪

పున ర్నిత్యం మహాభక్త్యా శ్రీమద్దభ్ర సభాపతిమ్।
ప్రదక్షిణత్రయం కృత్వా ప్రణమ్య భువి దండవత్॥ ౧౫

శ్రీమత్పంచాక్షరం మంత్రం జపిత్వా పూర్వవ త్పునః।
వత్సరాంతే యథాశక్తి ధనం దత్వా సభాపతేః॥ ౧౬

పూజాం పంచాక్షరేణైవ కురు శ్రద్ధాం పురస్సరమ్।
పునః ప్రసాద స్తే తస్య భవిష్యత్యేవ శౌనక! ౧౭

ఇట్లు దినదినము గావించుచు, ఒక్కయేడు ముగిసిన వెనుక మునుపటివలెనే మరల శివగంగలో స్నానాదిక మాచరించి శ్రీమూలస్థాననాయకుడగు నీశానదేవుని ముమ్మాఱుచుట్టి ప్రొక్కి, మఱల ననుదినము శ్రీమద్దభ్రసభాపతిని సేవించుచు వెనుకటివలెనే శ్రీమత్పంచాక్షర మంత్రమును మరల పదివేలు జపింపుము. అట్లు మరల నొకసంవత్సరము ముగిసిన పిదప సభాపతి నుద్దేశించి యథాశక్తి ధనధాన్యాదికము దానమొసగి, శ్రద్ధాపురస్సరముగా శ్రీమత్పంచాక్షరమంత్రముతోడనే ఆ దేవదేవుని పూజింపుము. ఇట్లు గావింతువేని శౌనకా! నీకా శివదేవుని ప్రసాదము లభింపగలదు. ఇందు సందియము లేదు.

బహవో దేవదేవస్య నృత్య మస్య ప్రసాదతః।
దృష్ట్వా స్వవాంఛితం సర్వం ప్రాప్తవంతో మునీశ్వరాః॥ ౧౮

పలువురు మునీశ్వరు లిట్టి పరమేశ్వరానుగ్రహమునవే ఆ భగవానుని నృత్యమును దర్శించి తమతమ వాంఛితముల నెల్ల బొందియున్నారు.

సూత ఉవాచ:—

ఏవం నందీశవచనం శ్రుత్వాఽసౌ శౌనకో మునిః।
సర్వం కృత్వా క్రమేణైవ శ్రద్ధయా మునిసత్తమాః॥ ౧౯

ప్రసాదేన మహేశస్య నర్తనం సర్వసిద్ధిదమ్।
దృష్ట్వా దభ్రసభామధ్యే భవాన్యా సహ శౌనకః॥ ౨౦

అతీవ ప్రీతి మాపన్నః స్తోత్రైః స్తుత్వా యథాబలమ్।
భక్త్యా పరవశో భూత్వా కించిత్కాలం మహామునిః॥

ఇట్లనిన నందీశుని పలుకులు విని శౌనకముని ఓ మునిసత్తములారా! ఆతఁడు చెప్పిన దంతయు నతిశ్రద్ధతో క్రమముగా నాచరించి, మహేశ్వరుని ప్రసాదమున శ్రీమద్దభ్రసభామధ్యమున సర్వసిద్ధిదమగు మహేశ్వరతాండవమును భవానీదేవితోఁగూడ దర్శించి, అతిప్రీతినిబడసి స్తుత్యములగు స్తోత్రములతో తనయోపినకొలది ఆమహాదేవుని స్తుతించి స్తుతించి, పారవశ్యమున కొంతకాలము మిన్నకయుండెను.

పునశ్చ దృష్ట్వా దేవేశం నృత్యంతం దేవనాయకమ్।
ప్రమోదేన స్వయం విప్రా అకరోద్దండనర్తనమ్॥ ౨౨

మరల తెలివిగొని ఆ శౌనకముని అత్యద్భుతముగా నటించుచున్న ఆదేవదేవుని మఱలమఱల గని మ్రొక్కి, ప్రమోదవశమున తానును దండప్రణామ పురస్సరముగా నర్తనము గావించెను.

దేవదేవోఽపి సంతుష్టః శౌనకాయ ద్విజోత్తమాః।
ప్రాహ గంభీరయా వాచా శౌనక త్వం మహామునే॥ ౨౩

ఓద్విజోత్తములారా! అటుగని దేవదేవుడగు శ్రీమహాదేవుడును సంతుష్టుడై, గంభీరమైన వాక్యముతో శౌనకున కిట్లనియె.

దేవానా మాదిభూతస్య ఋగ్వేదస్య మమాఽజ్ఞయా।
భవ నిర్వాహక స్త్వత్ర శాకల్యస్య విశేషతః॥ ౨౪

ఓ శౌనకమహామునీ! నీవు నా యాజ్ఞచే వేదముల కాదిభూతమగు ఋగ్వేదమునకు, అందును ముఖ్యముగా శాకల్యసంహితకు నిర్వాహకుడ వగుము.

ఏవ మాజ్ఞాపిత స్తేన శివేన మునిసత్తమః।
శౌనకో భగవాన్ విప్రా స్తథా నిర్వాహకోఽభవత్॥ ౨౫

ఇట్లు శివునిచే నాజ్ఞాపింపబడి విద్వద్వరుడగు శౌనకమునిప్రవరుడు అట్లే శాకల్యకృతపదవిభాగానుసారమున ఋగ్విధాన బృహద్దేవతా మహాపరియోగాది గ్రంథ నిర్వాహకుడయ్యెను.

తస్య శిష్యస్తు విప్రేంద్రా స్తద్వాక్యా దాశ్వలాయనః।
పూర్వోక్తేనైవ మార్గేణ భగవంతం త్రియంబకమ్॥ ౨౬

శ్రీమదభ్రసభామధ్యే నృత్యంతం దేవనాయకమ్।
దృష్ట్వా ప్రణమ్య మేధావీ ప్రసాదేన శివస్య తు॥ ౨౭

అభవ త్సూత్రకృ ద్విప్రాః శాకల్యస్య మహామునిః।

మహర్షులారా! ఆశౌనకునకు ఆశ్వలాయనుడను శిష్యుడు గలడు. ఆతడు మహామేధావి. ఆతడును తనగురువగు శౌనకుని యాదేశముచొప్పున పూర్వోక్తమగు మార్గమునే యవ

లంబించి, శ్రీమద్దభ్రసభామధ్యమున నటించుచున్న త్ర్యంబక భగవానుని దర్శించి, నమస్కరించి, శివమహాదేవు నను గ్రహమున శాకల్యసంహితకు సూత్రకర్తయయ్యెను. (కేవలము శౌనకుడు తాను ఋగ్వేద నిర్వాహకుడగుటయేగాక, తన శిష్యుడగు శాకల్యునిచేగూడ తన్నిర్వాహము నొనరింపించె నని యెఱుఁగనగును.)

ఏవం పూర్వోక్తమార్గేణ శ్రద్ధయా బహవోజనాః॥ ౨౮
దృష్ట్వా దభ్రసభామధ్యే నర్తనం శంకరస్య తు।
కృతార్థా వేదవిచ్ఛ్రేష్ఠా అభవన్నచిరేణ తు॥ ౨౯

ఇట్లు పూర్వోక్తమార్గమున పలువురు జనులు దభ్ర సభామధ్యమున శ్రీశంకరుని నర్తనమును దర్శించి అచిరకాల మున కృతార్థులును, వేదవిద్వరులు నయిరి.

తస్మాద్భవంతోఽపి పురోక్తవర్త్మనా
శివస్య నృత్యం శివయా నిరీక్షితమ్।
దృష్ట్వా మహేశస్య హరస్య శూలినః
ప్రసాదమాత్రేణ విముక్తిభాగినః॥ ౩౦

కావున మీరుసైతము పూర్వోక్తమార్గమున ననుష్ఠించి శివానిరీక్షితమైన శివతాండవమును దిలకించి, సర్వహరుడు, శూలధారియు నగు మహేశుని యనుగ్రహమాత్రముననే విముక్తిభాజను లగుదు.

భవత పరమతత్త్వప్రాప్త్యుపాయో మయోక్తః
సకలగురువరాణాముత్తమో వ్యాససంజ్ఞః।

అవద దతిరహస్యం తే పురా శ్రద్ధయైవ
ప్రవరగుణనిధానః పద్మనాభాంశభూతః॥ ३०

ఓ మహర్షులారా! మీకు నేనిట్లు పరమతత్త్వప్రాప్త్యుపాయము నెఱింగించితిని. సకలగురువర శ్రేష్ఠుడగు శ్రీ వేదవ్యాసమహాసీంద్రుడు అతిరహస్యమగు నిద్దానిని మున్ను నాయందలి కరుణచే నాకుపదేశించెను. ఆ వ్యాసమహాసీంద్రుడు ఉత్తమోత్తమగుణములకు నిధానమువంటివాడు. సాక్షాత్ శ్రీవాసుదేవుని అంశభూతుడు.

ఏవముక్త్వా మునీంద్రేభ్యః సూతః పౌరాణికోత్తమః।
కృష్ణద్వైపాయనం వ్యాసం సస్మార శ్రద్ధయా సహ॥ ३२

అని యిట్లు పౌరాణికోత్తముడగు సూతుడు మునీంద్రులకు దెలిపి, అతిశ్రద్ధతో కృష్ణద్వైపాయన వ్యాసభగవానుని స్మరించెను.

ఏతస్మిన్నంతరే శ్రీమాన్ మహాకారుణికోత్తమః।
కృష్ణాజినీ సోత్తరీయ ఆషాఢేన విరాజితః॥ ३३

భస్మోద్ధూలిత సర్వాంగః శుభ్రతిర్యక్త్రిపుండ్రధృత్।
రుద్రాక్షమాలా భరణో జపన్ పంచాక్షరం ముదా॥ ३४

శిష్యైస్తాదృగ్విధైర్యుక్తో మహాత్మా స్వయమాగతః।

ఇంతలో శ్రీమంతుడు మహాకారుణికోత్తముడు నగు వ్యాసభగవానుడు కృష్ణాజినమును ధరించి, ఆషాఢమును అనగా వ్రతిదండమును దాల్చి, భస్మోద్ధూలిత సర్వాంగుడు, శుభ్రతిర్యక్త్రిపుండ్రధారి, రుద్రాక్షమాలాభరణుడు నయి

పంచాక్షరమంత్రరాజము నతిమోదమున జపించుచు, స్వసమ వేషధారులగు పలువురు శిష్యులతోగూడి అచ్చటికి స్వయముగా విచ్చేసెను.

తం దృష్ట్వా పరమప్రీత్యా ప్రణమ్య భువి దండవత్॥ 35
సూతః స్వశిష్యై ర్మునిభిః సహ సత్యవతీసుతమ్।
తత్పాదపంకజం ద్వంద్వం విధాయ శిరసి క్రమాత్॥ 36
చక్షుషో ర్హృదయే చైవ సంతోషా ద్గద్గదస్వరః।
పాదప్రక్షాళనం కృత్వా పవిత్రం తజ్జలం పునః॥ 37
పీత్వా యథార్హం సంపూజ్య వ్యాసం శిష్యగణావృతమ్।
తద్వాక్యం వేదవత్సత్యం స్వశిష్యా న్వేదవిత్తమాన్॥ 38
శ్రావయిత్వా మహాధీమాన్ సహ తేనాఽఖిలై రపి,
శ్రీమద్వ్యాఘ్రపురం దివ్య మవాప పురుషార్థదమ్॥ 39

అట్లే తేరిన శ్రీకృష్ణద్వైపాయన వ్యాసగురువరుని గని, పరమప్రీతితో సాష్టాంగదండప్రణామములాచరించి, సూతుడు తన శిష్యులతో, మునులతోగూడ సత్యవతీసుతునకు మ్రొక్కి, తత్పాదపంకజ ద్వంద్వమును శిరమునందును, కన్నులయందును, డెందమునందును క్రమముగా ధరించి సంతోషభరవశమున నెలుగురాపడ పాదప్రక్షాళన మాచరించి, పవిత్రమగు తజ్జలమును పరమతీర్థముగా గొని త్రాగి, శిష్యగణావృతుడగు వేదవ్యాసభగవానుని యథార్హముగా బూజించి, వేదమువలె సత్యమేయగు నా వేదవ్యాసభగవానుని వాక్యమును వేదవిత్తములగు తనశిష్యుల నెల్లర వినజేసి, తదనంతర మాత

డా వేదవ్యాసునితోడను, తచ్ఛిష్యులగువారల నెల్లరతోడను గూడి పురుషార్థప్రదము, దివ్యము, శ్రీమంతము నగు వ్యాఘ్రపురమును జేర నరిగెను.

పునః సర్వే మునిశ్రేష్ఠా వేదవ్యాసపురోగమాః।
చాపే సూర్యే స్థితే రౌద్రే నక్షత్రే శ్రద్ధయా సహ॥ ౮౦

స్నానం కృత్వా మహాతీర్థే శివగంగాభిధే వరే।
యథాశక్తి ధనం దత్వా బ్రాహ్మణానాం మనీషిణామ్॥

ఉపోష్యైకం దినం దృష్ట్వా శ్రీమూలస్థాననాయకమ్।
ప్రదక్షిణత్రయం కృత్వా ప్రణమ్య ధరణీ తలే॥ ౮౧

షడక్షరేణ మంత్రేణ శ్రీమూలస్థాననాయకమ్।
సమారాధ్యాఽయుతం నిత్యం జపిత్వా మంత్రముత్తమమ్॥

అచ్చట వేదవ్యాసపురోగములగు మునిశ్రేష్ఠు లెల్లరు సూర్యుడు ధనుస్సునందుండగా రుద్రదేవతాకమైన ఆర్ద్రా నక్షత్రమున ప్రాతఃకాలమున నతిశ్రద్ధతో శివగంగాభిదమైన మహాతీర్థరాజమున స్నానమాచరించి, మనీషులగు బ్రాహ్మణ పుంగవులకు యథాశక్తి ధనాదికము దానమొనరించి ఒక్కనా డుపవసించి, శ్రీమూలస్థాన నాయకుని దర్శించి, ప్రదక్షిణ త్రయము గావించి, దండమువలె నేలపై జాగిలిబడి మ్రొక్కి, షడక్షరమంత్రముతో శ్రీమూలస్థాననాయకుని గొలిచి, అదే మంత్రరాజమును నిత్యము పదివేలు జపింప మొదలిడిరి.

వత్సరాంతేచ తీర్థేఽస్మిన్ స్నానం కృత్వా మహత్తరే।
ప్రదత్వా పూజ్య దేవేశం శ్రీమూలస్థాననాయకమ్॥ ౮౮

తతః సభాపతిం నిత్యం ప్రణమ్య భువి దండవత్।
మంత్రం షడక్షరం నిత్యం జప్త్వాఽయుత మాదరాత్॥

ఇట్లొక యేడు గడచిన వెనుక వారు సుమహత్తరమగు నా శివగంగాతీర్థమున మఱల స్నానమొనరించి, దానాదిక మాచరించి, దేవేశుడగు శ్రీమూలస్థాననాయకుని పూజించి, పిదప సభాపతియగు పశుపతి ననుదినము దండప్రణామసమర్పణమున నర్చించుచు, నిత్యము పంచాక్షరమంత్రమును పదివేలు నియతితో జపించుచు నుండిరి.

వత్సరాంతే ధనం దత్వా బ్రాహ్మణానాం యథాబలమ్।
శ్రీమత్పంచాక్షరేణైవ సతారేణ మహేశ్వరమ్।
పూజయామాసు రత్యంతం శ్రద్ధయైవ సభాపతిమ్॥ ౪౬

మఱల సంవత్సరము గడచినపిదప బ్రాహ్మణులకు యథాశక్తి ధనాదిక మొసగి, సప్రణవమగు శ్రీమత్పంచాక్షర మంత్రముతోడనే వారు సభాపతియగు మహేశ్వరు నత్యంతశ్రద్ధతో పూజించిరి.

తతః ప్రసన్నో భగవాన్ మహేశ్వరో
మునీశ్వరాణా మపి దృష్టిగోచరః।
ప్రనృత్యమానోఽభవ దంబికాపతిః
సమస్తవేదాంతసభాపతిః శివః॥ ౪౭

అపుడు సమస్తవేదాంతసభాపతియు, శివుడును, అంబికాపతియు నగు మహేశ్వరభగవానుడు నృత్యము గావించుచు, వేదవ్యాసాదులకును మునీశ్వరులకు నెల్లరకు దృష్టిగోచరుడయ్యెను.

వ్యాసాదయో వేదవిదాం వరా హరం
దివాకరాణాం శతకోటికోటిభిః।
సమానతేజస్క మతీవ నిర్మలం
విశాలవక్షస్థల మార్తిహారిణమ్॥ ౭౮

వేదవిత్ప్రవరులగు వ్యాసాదులు శతకోటికోటి దివాకరులతో దులదూగు తేజస్సుతో మెఱయుచు, అతినిర్మలుడై, విశాలవక్షస్థలమున సకలార్తిహారియై దర్శన మొసగిన శివుని గనుగొనిరి.

దృష్ట్వా ప్రమోదేన మహత్తరేణ తే
ప్రణమ్య సర్వే భువిదండవత్పునః।
ప్రజల్ప్య భక్త్యా వివశా విచేష్టితా
నివృత్తబంధా అభవన్ ప్రసాదతః॥ ౭౯

వెనువెంటనే వారెల్లరు అతిమహత్తరమైన ప్రమోద భరముతో నిండి, దండవత్ప్రణామములాచరించి, పరమభక్తి భావమున నామహేశ్వరుని స్తుతించి, వివశులై చేష్టలుడిగి, మహేశ్వరుని ప్రసాదమున నివృత్తసమస్తబంధనులైరి.

పుష్పవృష్టి రభవన్మహత్తరా
స్వస్తిమంగళపురస్సరాఽపి చ।
కాహలాదిపరిపూరితం జగత్
తోషితా అపి సురాసురా జనాః॥ ౮౦

అయ్యవసరమున స్వస్తిమంగళపురస్సరముగా గొప్ప పుష్పవృష్టి కురిసెను. జగత్తంతయు కాహలాది వాద్యధ్వను

లతో నిండిపోయెను. సురాసురులు, జనులు నెల్లరు నతిసంతోషము నొందిరి.

ఆగతా అపి సురాసురా జనా
అప్సరోభి రఖిలై రనుత్తమైః।
శంకర శ్చ భగవాన్ సభాపతిః
సర్వలోకహితకామ్యయాంబయా॥ ౫౧

సహ పరికరబంధం వేదమంత్రేణ కృత్వా
నిఖిలభువననాథో నీలకంఠ స్త్రినేత్రః।
సకలజనసమూహైః సేవ్యమానః స్వభక్తై
స్తనయయుగలయుక్తో నందినాఽఽనందితేన॥ ౫౨

మహోత్సవవినోదేన భగవాన్ పరమేశ్వరః।
పుండరీకపురం దివ్యం ప్రాదక్షిణ్యక్రమేణ సః॥ ౫౩

మఱియు నత్తరి సురాసురులెల్లరు గణనీయములగు నుత్తమాప్సరోగణములతో సహ అచ్చటికి వచ్చిరి. సభాపతియగు శంకరభగవానుడును సర్వలోకహితకామనతో అంబికాదేవితోసహా వేదమంత్రములతో నడుముకట్టి, నిఖిలభువననాథుడగు నీలకంఠుడును త్రినేత్రుడగుటవలన సకలజనసమూహములచే సేవింపబడుచు తనయిరువురుకుమారులగు వినాయకస్కందులతోడను, నందితుడగు నందీశునితోడను గూడి, మహోత్సవవినోదమున దివ్యమగు పుండరీకపురవరమును ప్రాదక్షిణ్యక్రమమున జుట్టి సంచారము చేసెను.

చరిత్వా శివగంగాయాం శంభు స్తాండవమండితః।
స్నానం కృత్వా దదౌ తీర్థం సర్వేషాం ప్రాణినాం హరః॥

అట్లు సంచారముగావించి, మహాతాండవమండితుడగు శంభుదేవుడు శివగంగయందు స్నానమాడి. సర్వప్రాణులకు సకలార్తిహరుడై తీర్థము నొసగెను.

సురాసురాదయో యస్మిన్ శివగంగాభిదే వరే।
శ్రద్ధయా సన్నిధౌ తస్య స్నానం కృత్వా యథాబలమ్।
ధనం ధాన్యం చ వస్త్రం చ తిలం గాం భూమి ముత్తమామ్।
ప్రదత్వా శివభక్తేభ్యః శంకరం శశిభూషణమ్॥ ౫౮
నీలకంఠం విరూపాక్షం తుష్టువుశ్చ సురాదయః।

సురాసురాదులెల్లరు నాశివగంగాతీర్థమున శివసన్నిధానమున తనివితీర స్నానమొనరించి, ధనము, ధాన్యము, వస్త్రము, తిలలు, గోవులు, భూమి మున్నగువానిని శివభక్తులకు భక్తితో నొసగి, శంకరుడు, శశిభూషణుడు, నీలకంఠుడు, విరూపాక్షుడు నగు రుద్రభగవాను నిట్లుస్తుతించిరి.

నమస్తే రుద్రమన్యవ ఉతోత ఇషవే నమః॥ ౫౭
నమస్తే అస్తు ధన్వనే కరాభ్యాం తే నమో నమః।
యా తే రుద్ర శివా తనూః శాంతా తస్యై నమోనమః॥

ఓ రుద్రుడా! నీమన్యువునకును, నీబాణములకును, నీ ధనుస్సునకును, నీబాహువులకును నమస్కారము. శివకరము, శాంతము నగు నీ తనువునకుగూడ నమస్కారము.

నమోఽస్తు నీలగ్రీవాయ సహస్రాక్షాయ తే నమః।
సహస్రపాణయే తుభ్యం నమో మీఢుష్టమాయ తే॥

ఓ దేవదేవుడా! నీవు నీలగ్రీవుడవు, సహస్రాక్షుడవు, సహస్రపాణివి, శ్రేష్ఠతముడవునై వెలుగొందు చున్నావు. అట్టి నీకు నమస్కారము.

కపర్దినే నమ స్తుభ్యం కాలరూపాయ తే నమః ।
నమ స్తే చాఽఽత్తశస్త్రాయ నమ స్తే శూలపాణయే॥ ౭౦

ఉజ్జ్వలమగు జటాజూటముతో నీవు మెఱయుచున్నావు. నీవు కాలరూపుడవు. కావున శస్త్రములనుధరించి శూలపాణివై యున్నావు. అట్టి నీకు నమస్కారము.

హిరణ్యపాణయే తుభ్యం హిరణ్యపతయే నమః ।
నమ స్తే వృక్షరూపాయ హరికేశాయ తే నమః॥ ౭౧

హిరణ్యమునకుపతివై నీవు హిరణ్యమును పాణిపుటమున దాల్చియుండు మహానుభావుడవు మఱియు నీవు వృక్షస్వరూపుడవు. తత్సూచకములుగా నీ కేశములు హరిత వర్ణమున వెలుగొందు చున్నవి. అట్టి నీకు నమస్కారము.

పశూనాం పతయే తుభ్యం పథీనాం పతయే నమః ।
పుష్టానాం పతయే తుభ్యం క్షేత్రాణాం పతయే నమః॥

పశులకు అనగా జీవులకెల్లఱకు నీవు పతివి. పథములకు పథానుసారులకు నీవు పాలకుడవు. వాక్యపుష్టి జ్ఞానపుష్టి మున్నగు దశవిధపుష్టులకును, అట్టి పుష్టిసంపదకలవారలకును, సకలక్షేత్రములకును నీవే పతివై యున్నావు. అట్టి మహానుభావునకు నీకు నమస్కారము.

ఆతతావిస్వరూపాయ వనానాం పతయే నమః।
రోహితాయ స్థపతయే వృక్షాణాం పతయే నమః॥ ౬౩

నీవు ఆతతావిస్వరూపుడవు. అనగా అధిజ్యమైన ధనువుతో సమస్తమును గాపాడువాడవు. నీవు వనములకధీశుడవు, రక్షకుడవును. మఱియు నీవు రోహితవర్ణముగల దేహముగల వాడవు. స్థపతి అనగా నిలిచిసర్వమును బ్రోచువాడవు. వృక్షపతివినయి యున్నావు. అట్టి నీకు నమస్కారము.

నమస్తే మంత్రిణే సాక్షాత్ కక్షాణాం పతయే నమః।
ఓషధీనాం చ పతయే నమః సాక్షాత్పరాత్మనే॥ ౬౪

మంత్రివియు సాక్షాత్తు కక్షలకు అనగా ప్రతిపక్షములు లేదా గహనములగు దేశములు, భాషలు, ధర్మాధర్మములు మున్నగువానికి పతివియు, ఓషధులకు నాథుడవును, రక్షకుడవును, సాక్షాత్తు పరాత్మవునై యొప్పు నీకు నమస్కారము.

ఉచ్చైర్ఘోషాయ దేవాయ పత్తీనాం పతయే నమః।
సత్త్వానాం పతయే తుభ్యం ధనానాం పతయే నమః॥ ౬౫

ఉచ్ఛ్రితములగు స్తోత్రములతో నెల్లప్పుడు స్తుతింపబడుచుండు దేవదేవుడవు. నీవు స్వప్రకాశస్వరూపుడవు. పత్తి అనగా ఒక ఏనుగు, ఒక రథము, మూడు అశ్వములు గల సమూహమునకు పత్తి అని పేరు. అట్టి పత్తులకు నీవు పతివై యున్నావు. అంతియగాక నీవు మహాప్రమథగణముల కధినాథుడవు, ధనపతివియు నయి వెలుగొందుచున్నావు. అట్టి నీకు నమస్కారము.

సహమానాయ శాంతాయ శంకరాయ నమో నమః,
ఆధీనాం పతయే తుభ్యం వ్యాధీనాం పతయే నమః॥ ౬౬

సహమానుడవు, శాంతుడవు, శంకరుడవు, ఆధివ్యాధులను బోనడచువాడవు నగు నీకు మాటిమాటికి నమస్కారము.

కకుభాయ నమస్తుభ్యం నమస్తేఽస్తు నిషంగిణే।
స్తేనానాం పతయే తుభ్యం కృత్రిమాయ నమో నమః॥

దిక్కులే వస్త్రములుగాను, నివాసస్థానముగాను గలవాడవు, అమ్ములపొదిని ధరించినవాడవు, చౌర్యాదులకు ఛలములకు పతివియు నగు నీకు నమస్కారము.

తస్కరాణాం నమస్తుభ్యం పతయే పాపహారిణే।
వంచితే పరివంచితే స్తాయూనాం పతయే నమః॥ ౬౮

తస్కరులగువారికి నీవు పతివి. సర్వపాపములను నీవు హరించివేయు మహానుభావుడవు. గమనశీలుడవు. నీ వెల్లప్పుడు నెల్లెడ నవ్యాహతముగా గమనము నొనరించుచుందువు. స్తాయువులు – అనగా కపట సాధువేషములను ధరించి ఛద్మచారులై వస్త్రాదికముల నపహరించువారు తాయువులు అని చెప్పబడుదురు. తాయువులే యిచట స్తాయువులు అని పేర్కొనబడిరి. అట్టి స్తాయువులకు నీవే పతివై యున్నావు. అట్టి నీకు నమస్కారము.

నమో నిచీరవే తుభ్య మరణ్యాపతయే నమః।
ఉష్ణీషణే నమస్తుభ్యం నమస్తే పరమాత్మనే॥ ౬౯

నీవు నిరంతరచరణశీలుడవు. అరణ్యపతివి. నీవు ఉష్ణీషమును అనగా – తలపాగా ధరించియుం*వాడవు. నీవు

పరమాత్మవు నయి యున్నావు. అట్టి నీకు మాటిమాటికి నమస్కారము.

విస్తృతాయ నమ స్తుభ్య మాసీనాయ నమో నమః।
శయానాయ నమస్తుభ్యం సుషుప్తాయ నమో నమః॥ ౨౦

ప్రబుద్ధాయ నమ స్తుభ్యం స్థిరాయ పరమాత్మనే।
సభారూపాయ తే నిత్యం సభాయాః పతయే నమః॥ ౨౧

విస్తృతుడవునీవు, కూర్చుండియుంనవాఁడవునీవు, శయనించియుండువాడవు నీవు, నిదురించువాడవు నీవు, మేల్కాని యుంనువాడవునీవు. నీవు స్థిరరూపుడవు. పరమాత్మవు. సభారూపుడవు. సభాపతివి. అట్టి నీకు నిత్యము మాటిమాటికి నమస్కారము.

నమః శివాయ సాంబాయ బ్రహ్మణే సర్వసాక్షిణే॥ ౨౨

శివుడవు, శివంకరుడవు, అంబాసహితుడవు, బ్రహ్మవు, సర్వసాక్షివి, సర్వమునయిన నీకు నమస్కారము.

సూత ఉవాచ:—

ఏవం సురాసురై రన్యైః శంకరోఽభిష్టుతః పునః।
కృత్వా ప్రసాదం సర్వేషాం తత్రైవాంతర్హితోఽభవత్॥

సూతుడు చెప్పెను. ఇట్లు సురాసురులచేతను, తక్కంగల యితరులచేతను, స్తుతింపబడి శంకరుడు వారందఱిపై తన యనుగ్రహమును బఱపి, అచటనే అంతర్హితు డయ్యెను.

అస్య తీర్థస్య మాహాత్మ్యం స్థానస్యాస్య సభాపతేః।
యో వేత్తి శ్రద్ధయా ముక్తిః సిద్ధా తస్య మహాత్మనః॥ ౨౪

ఈతీర్థముయొక్కయు, ఈస్థానముయొక్కయు, ఈసభాపతియొక్కయు, మాహాత్మ్యము నెవ డతిశ్రద్ధతో నెఱిగి కొనునో ఆమహాత్మునకు ముక్తి సిద్ధమై పనుపడును.

యః పఠే చ్ఛృణుయా ద్వాఽపి ముక్తిఖండ మిమం సదా।
స సాక్షా న్ముక్తి మాప్నోతి ప్రసాదేన సభాపతేః॥ ౭౫

ఈముక్తిఖండము నెవడు నిత్యము పఠించునో, లేక వినునో, ఆతడు సాక్షా త్సభాపతిప్రసాదమున ముక్తిని బడయును.

నమో వ్యాసాయ గురవే మమవిజ్ఞాన దాయినే।
నమః శివాయ సోమాయ సాక్షిణే ప్రత్యగాత్మనే॥ ౭౬

ఇతి శ్రీస్కాందపురాణే సూతసంహితాయాం ముక్తిఖండే
ఈశ్వరనృత్యదర్శనం నామ నవమోఽధ్యాయః
సమాప్తః.



అనిపలికి సూతుడు - నాకుగురువరుడై, విజ్ఞానమును ప్రసాదించిన శ్రీకృష్ణద్వైపాయనవ్యాసభగవానునకు నమస్కారము. శివుడు, ఉమాసమేతుడు, సాక్షి ప్రత్యగాత్మయు నగు మహాదేవునకు నమస్కారము. అని వ్యాసమహాదేవుల కిరువురకు నమస్కరించెను.

ఇది శ్రీస్కాందపురాణమున సూతసంహితయందు ముక్తిఖండమున
ఈశ్వరనృత్యదర్శన మను తొమ్మిదవ అధ్యాయము
సమాప్తము.

జానకిరాంరాం ప్రెస్, తెనాలి.